ఆంధ్ర పండిత భిషక్కుల

# భాషాభేషజం

గిడుగు వెంకటరామమూర్తి పంతులు, బి. ఏ.

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# ఆంధ్రపండిత భిషక్కుల
# భాషాభేషజం

కందుకూరి వీరేశలింగకవి
స్మృతిచిహ్నముగా అంకితము

# ప్రథమ ప్రచురణకు
# సంపాదకీయ భూమిక



శ్రీ రామమూర్తిపంతులుగారు వ్యావహారికభాషను పునఃప్రతిష్ఠితము చేయడానికి సుమారు పాతిక సంవత్సరములనుంచి చేస్తూవున్న వాదములో ప్రధానముగా నాలుగు మార్గములు గోచరిస్తున్నవి.

భాషాతత్త్వ ప్రదర్శనపూర్వకముగా ప్రపంచములోని ఇతర భాషావాఙ్మయముల చరిత్రములున్ను, వాటితో పోల్చి ఆంధ్రభాషావాఙ్మయముల చరిత్రములున్ను బోధించి తక్కిన భాషలవలెనే తెలుగుకూడా నానాటికి మారుతూ వచ్చినదనీ, ఆయాకాలముల కవులు తమనాడు శిష్టవ్యవహారసిద్ధమయిన భాషను కావ్యాలలో ప్రయోగిస్తూ వచ్చినారనీ, నేటి రచయితలుకూడా ఈ శిష్టాచారమే పాటించి వ్యావహారికభాషలో గ్రంథములు వ్రాస్తే భాషా ప్రయోజనము చక్కగా నెరవేరుతుందనీ, నోటిమాటకూ చేతివ్రాతకూ సామరస్యము కుదిరి ఒకదాని కొకటి పోషకముగా ఉన్నప్పుడే వాఙ్మయములోని భాష సహజముగానూ, సరళముగానూ, సుబోధకముగానూ పరమ ప్రయోజనకారిగానూ ఉంటుందనీ నిరూపించడము ఒకమార్గము.

వ్యావహారికభాషను బహిష్కరించి గ్రాంథికాంధ్రమును దానిస్థానములో నెలకొల్పడానికి ప్రయత్నిస్తూ ఉన్నవారు ప్రాచీన తాళపత్రగ్రంథములలో ఉన్న లౌకికభాషను ఎట్లు గ్రాంథికీకరణముచేసి కూటకరణ దోషమునకు పాల్పడి భాషకు అపారమయిన అనర్థము కలుగజేసినారో ఋజువుచేసి పూర్వులు వ్రాసిన పురాణ (వచన) ములూ, లక్షణగ్రంథములూ, వ్యాఖ్యానములూ, టీకలూ, వివిధశాస్త్రగ్రంథములూ, దేశచరిత్రములూ, జానపదవృత్తాంతములూ, వార్తాపత్రికలూ, శాసనములూ. కథలూ, బడిపుస్తకములూ మొదలయిన అన్ని విధముల రచనలలోనూ వచనము వ్యావహారికభాషలోనే ఉన్నదని నిదర్శన పూర్వకముగా సిద్ధాంతీకరించి, ఏ భాషలోనయినా ఇదే నిజమయిన వచన రచనా సంప్రదాయమని నిరూపించడము రెండోది.

'గ్రాంథికభాష' అని మన పండితులు వ్యవహరించేదాని స్వరూపము ఇదమిద్ధమని నిర్ణయించడానికి వల్లపడదనీ, మన వ్యాకరణములు పరస్పరవిరుద్ధములుగానూ, అసమగ్రములుగానూ ఉండడమువల్ల ఏది తప్పో ఏది ఒప్పో

నిర్ధారణచేయడము దుష్కరమనీ, ఒక పండితుడికి గ్రాహ్యమయిన ప్రయోగము ఇంకొకరిమతములో అగ్రాహ్యమనీ, ఒక మహామహోపాధ్యాయుల గ్రంథాలలో ఇంకో మహామహోపాధ్యాయులవారికి వేనవేలు తప్పులు కానవస్తూఉన్నవనీ, గ్రాంథిక భాషలో నిర్దుష్టముగా వ్రాసిన గ్రంథము మచ్చుకి ఒక్కటిఅయినా లేదనీ, గ్రాంథికభాష పండితప్రకాండులకయినా సాధ్యపడక ఇంత అవ్యవస్థ ముగా ఉన్నదనీ ప్రాచీనభాషలో శబ్దస్వరూపమూ శబ్దార్థమూ నిర్ణయించడమే బహుకష్టముగా ఉన్నందువల్ల ఆభాషలో స్వతంత్రరచన సాగించడము అసంభవమనీ నిరూపించడము మూడోమార్గము.

ప్రాచీనకవుల కావ్యములన్నీ సమగ్రముగా పరిశీలించకపోవడమువల్ల వ్యాకరణకర్తలూ, కోశకారులూ, పండితులూ తప్పులుగా భావించి లక్షణ విరుద్ధములనీ గ్రామ్యములనీ నిందించిన రూపములు వందలకొలదిగా కవులకావ్యములలో ప్రయుక్తములై ఉన్నవనీ, వ్యాకరణము ప్రయోగమూలముకావడము వల్ల కవిప్రయోగము లక్షణముకంటె బలవత్తరమైనదనీ, కవులు ప్రయోగించిన రూపములు లక్షణములో చెప్పకపోతే లక్షణమే అసమగ్రమూ దుష్టమూ అవుతుంది కాని ప్రయోగములు నింద్యములు కావనీ నిరూపించి, అట్టి రూపములకు— ప్రతిపక్షులు ఎదురాడుటకు వీలులేనట్టుగా—కవుల కావ్యములనుంచి వందలకొద్దీ ప్రయోగములు చూపి నిర్దుష్టత్వ మాపాదించడము నాలుగో మార్గము.

ఈనాలుగుమార్గములూ వ్యక్తపరచేగ్రంథములు వరుసగా శ్రీపంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములలోని వ్యాసావళి, గద్యచింతామణి, ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము, బాలకవి శరణ్యమున్ను.

ప్రకృత గ్రంథములో కళాప్రపూర్ణ వేదం వెంకటరాయశాస్త్రిలవారి గ్రాంథికాంధ్రభాషాపాండిత్యమును శ్రీ రామమూర్తి పంతులుగారు విమర్శించినారు. తెలుగుపండితులలో అగ్రగణ్యులైన వీరి భాష దోషభూయిష్ఠముగా ఉన్నదని ఋజువుచేస్తే గ్రాంథికాంధ్రము నిర్దుష్టముగా వ్రాయడము ఎంతటి పండితులకయినా అసాధ్యమని బోధపడుతుంది; ప్రజలు కృతక భాషావ్యామోహమును పరిత్యజిస్తారు.

ఇందులో ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజమనీ, మిథ్యాపవాదమనీ రెండు వ్యాసములు ఉన్నవి. మొదటిది పంతులుగారు ప్రకటించిన 'తెలుగు' పత్రిక నుంచిన్నీ, రెండోది ఏలూరిపాటి రామభద్ర చయనులుగారు ప్రకటించిన 'సారస్వత సర్వస్వము' నుంచిన్నీ పునర్ముద్రితములు.

జన్మదినోత్సవ నిర్వాహకసంఘమువారి కోరికపైని భాషాపోషకులూ, ఉదార హృదయులూ శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఈ

గ్రంథము ఉచితముగా ముద్రించి ఇచ్చి గొప్ప సహాయము చేసినందుకు ఈ సంఘముపక్షమున వారికి కృతజ్ఞతతో వందనము లర్పిస్తున్నాను. ఈ గ్రంథము ప్రూపులు ఓపికతో దిద్ది నా కత్యంత సాహాయ్యముచేసినవారు శ్రీ రామమూర్తి పంతులుగారి శిష్యకోటిలో ప్రధానులూ, సహృదయులూ, నాకు గురుతుల్యులూ అయిన శ్రీ కాళ్ళకూరి సూర్యనారాయణ పంతులుగారు. వారికి నా హృదయ పూర్వక ప్రణామములు.

జన్మదినోత్సవ సంఘమువారికి శ్రీ పంతులుగారు తమ రచనలు ప్రకటనార్థము ఇచ్చినందుకు వారికి ఈ సంఘముతరపున కృతజ్ఞతాపూర్వక వందనములు సమర్పిస్తున్నాను.

గుంటూరు
నవంబరు, ౧౯౩౩.

తెలికిచెర్ల వెంకటరత్నం,
సంపాదకుడు.



# మిథ్యాపవాదము

## ప్రస్తావన

ఈ వ్యాసమునకు పీఠిక వ్రాయనారంభించినప్పుడు నా మిత్రులిద్దరు నన్ను చూడవచ్చి, దీనిలోని విషయమును గురించి ప్రసంగించినారు. ఆ ప్రసంగమే ప్రస్తావనగా రచించి చేర్చినాను.

నాయుడుగారు—మేము వచ్చినపని అయినది, గాని మీపనికి ఆటంకమైనది, ఏదో వ్రాస్తున్నారు—రేపు మళ్ళీ వస్తాము.

నేను—చిన్న వ్యాసమొకటి—

నా—దేన్ని గురించి ?

ఆచార్లుగారు—విషయమేమిటండి ?

నేను—మిథ్యాపవాదము—కూర్చుని వినండి, చెప్తాను—మీరువిన్నారో లేదో ?—దుష్టప్రబంధ నిర్మాతలట ! భాషాదేవికట ! విషప్రయోగముచేసినారట ! విషము శల్యములోనికి దిగినదట ! దేవిగారు ప్రాణసంశయదశలో ఉన్నారట ! వెంటనే తగిన చికిత్స చేయకపోతే—

ఆ—(చెవులు మూసుకొని) కృష్ణ కృష్ణ ! ఏమిటా అవాచ్యము ! ఎవరావిషప్రయోగముచేసిన పాపాత్ములు ?

నేను—దుష్టప్రబంధ నిర్మాతలని చెప్పినానే.

ఆ—ఎవరా పాపిష్ఠిదుష్ట ప్రబంధ నిర్మాతలు ?

నేను—అనేకులట. వారికి ప్రతినిధులు, ప్రధానులు. కీర్తిశేషులయిన రావుబహదరు కందుకూరి వీరేశలింగం పంతులుగారట !

నా—ఎంతమాట ! ఎంతమాట ! భాషాదేవికి విషంపెట్టి ప్రాణసంశయ దశలోకి తెచ్చినవారా వీరేశలింగంపంతులుగారు ? యావజ్జీవము గాఢమైన భక్తితో భాషాదేవికి నిరంతరసేవచేసిన వీరేశలింగం పంతులుగారేమిటి, భాషాదేవికి విషంపెట్టడమేమిటి ? ఎవరండీ ఇట్టి తొందరమాటలాడినవారు ?

నేను—చెప్పనా ?—బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రిలవారు.

ఆ—(ముక్కుమీద వేలుపెట్టుకొని) ఆ! ఏమిటీ! వేదం వేంకటరాయ శాస్త్రిలుగారే ? ఎంత దారుణము! ఎప్పుడన్నారీలాగున ? ఎక్కడ ?

నేను—1919-వసం॥ జూన్ 7వతేదీని నెల్లూరిపురమందిరమందు ఆంధ్ర సాహిత్య పరిషదష్టమవార్షికసభలో—

నా—అన్నట్టు జ్ఞాపకంవచ్చినది! ఆ సభకు నేను వెళ్ళినాను. ఆ శాస్త్రిలుగారే సభాధ్యక్షులు. అధ్యక్షోపన్యాసము మొదలుపెట్టి ముగించినదాకా ఏవో హాస్యాలూ పరాచికాలూ చెప్పి అందరినీ నవ్వించినారు. ఏవో పుస్తకాల లోని వాక్యాలున్నూ, శబ్దాలున్నూ ఉదాహరించి అవి విషప్రయోగాలని చెప్పినారు. అధ్యక్షోపన్యాసమంతా ప్రహసనమే మాటిమాటికీ చప్పట్లే ముచ్చట్లు చెప్పు కొంటూఉన్నవారుకూడా చప్పట్లు వినపడ్డప్పుడు కొంచెము ఆగి, తాముకూడా గట్టిగా చప్పట్లుకొట్టి, ఒకమారు నవ్వి, మళ్ళీ ముచ్చట్లు చెప్పుకొనేవారు. అయితే ఈ ప్రహసనమునకు నాయకులు వీరేశలింగంపంతులుగారే అని ఎవ్వ రికీ తెలియలేదుసుమండీ. శాస్త్రిలుగారు పంతులుగారిపేరు ఎక్కడా ఎత్తలేదు; మీరేలాగున కనుక్కొన్నారోగాని—

ఆ—ఇది హాస్యానికి విషయమా ? భాషాదేవిని ప్రాణసంశయ దశ లోనికి తెచ్చినారంటే, జాలిపుట్టి ఏడుస్తారుగాని నవ్వుతారా ఎవ్వరైనా ? భాషా దేవికి విషంపెట్టినారని చెప్పినప్పుడు కోపంవచ్చి వళ్ళు మండవలసినది నిజ ముగా భక్తిగలవాళ్ళయితే. మన నాయుడుగారుకూడా—

నా—ఎంత సత్యకాలంవాళ్ళండీ ఆచార్లుగారూ, మీరు! ఉపన్యసించిన అధ్యక్షులకు ఏమైనా జాలీ, కోపము, దుఃఖము నిజముగా ఉంటేగదా, సభవారి మనస్సులో ఆభావాలు ఉద్రేకించడం?—ఆయన నవ్వుటాలకోసమే ఉపన్య సించినప్పుడు విన్నవాళ్ళకు నవ్వుటాలుకాక మరేమిటో? మీరాసభలోఉంటే నాలాగే మీరూ నవ్వుదురు. ఆయన విమర్శించిన గ్రంథాలు చిన్న బడులలోను, పెద్దకాలేజీలలోను పిల్లవాళ్ళు చదివే పుస్తకాలట! అవి గ్రామ్యవాదులు రచించి నవిగాబోలు; గ్రామ్యప్రయోగాలు చూపించి శాస్త్రిలుగారు ఎప్పటిలాగే హాస్యా లుచేసి గ్రంథకర్తలను వెక్కిరిస్తున్నారు గాబోలును అని పండితులు హర్షించి ఉంటారు. ఇది పండితులకు ఇప్పుడు మామూలు అయినది గదా.

ఆ—వీరేశలింగం పంతులుగారు గ్రామ్యవాదులు కారేమో!

నా—కారు; మొట్టమొదట పంతులుగారు గ్రామ్యవాదమును ఖండించిన వారే; గాని, ఆయనమతం—

నేను—ఆయనమతం ఇదమిత్థమని ఎవరున్ను చెప్పలేరు. పూర్వము పండితులనుకూడా "పెడెంట్లు" అని ఆయన ఆక్షేపించలేదా ఏమి? ఆలాగున

ఆక్షేపించినందుకేగదా వేంకటరాయశాస్త్రులుగారికి పంతులుగారిమీద కోపము వచ్చినది. పంతులుగారికి ఎప్పుడు ఏది మంచిదని తోస్తుందో అప్పుడు అదే సమ్మతము. భాషావిషయములో చూడండి. చిన్నయసూరి మిత్రభేదము రచించినట్టు ప్రాచీనాంధ్ర కావ్యములలోని భాష అభ్యసించి విగ్రహము, సంధి రచించినారు. అప్పుడు అదే యుక్తమని ఆయనకు తోచినది. అది అయుక్తమని తోచినతర్వాత అట్టి గ్రంథములు ఆయన మరి రచించలేదు. అట్టి అయుక్తమయినపని చేసినందుకు తమ్ము తాము నిందించుకొన్నట్టు స్వీయచరిత్రము రెండోభాగములో వారు ప్రకటించినారు; చూడండి పుట 156. అందరికీ తెలిసేటట్టు సువరచితమైన భాషలో రచించడము ఉచితమని తోచినప్పుడు నాటకాలు, నవలలు, ప్రహసనములు మొదలయినవి ఆలాగున రచించినారు. పండితులు ఆక్షేపించినా, పంతులుగారు లక్ష్యపెట్టలేదు. ఎన్నోసార్లు వ్యావహారిక భాషా ప్రయోజనమునుగురించి వారితో నేను చర్చించినాను. అంతకంతకు నాఉద్దేశము వారికి సమ్మతమైనది. తుట్టతుదకు 1919-వ సం॥ ఫిబ్రవరి నెల 28 తేదిని నాసలహా అంగీకరించి, "వర్తమానవ్యావహారికాంధ్రభాషాప్రవర్తకసమాజము" ఒకటి రాజమహేంద్రవరమునందే స్థాపించి దానికి వారే అధ్యక్షులయినారు. అప్పుడు వారు కవుల చరిత్రము రెండవకూర్పు అచ్చువేయించుటకుగాను గ్రంథము సవరిస్తూ ఉండిరి. ఈపని పూర్తికాగానే వాడుకభాషలో గ్రంథరచనకు పూనుకొంటామని సభలో చెప్పినారు. అయితే మనదురదృష్టముచేత మరి మూడుమాసములకే పంతులుగారు కాలంచేసినారు. వీరు మొదట "గ్రామ్యవాదము" ఖండించినవారే అయినా, పూర్వులు ప్రయోగించని నేటి వాడుక మాటలు మొదటినుండిన్ని వాడినట్లు వారిగ్రథాలలో కనబడుతున్నది. అది దోషముగా వారు ఒప్పుకోలేదు ఈవిషయములోకూడా వేంకటరాయ శాస్త్రులుగారికిన్ని పంతులుగారికిన్ని మతభేదమున్నది. వ్యావహారికభాష శాస్త్రులుగారి మతమందు అస్పృశ్యము, అవాచ్యము; పంతులుగారి మతమందు యోగ్యము, సేవ్యము.

ఆ—అయితే, ప్రతిపక్షులపేరుచెప్పి మరీ శాస్త్రులవారు ఆక్షేపించవలసి ఉండెను. పిరికివారిలాగున ఊరూపేరూచెప్పకుండా, కాకిమీదనో, గెద్దమీదనో పెట్టి, దుర్భాషలాడి తిట్టడము నీచమైనపనికాదా?

నా—వీరేశలింగం పంతులుగారిని పేరుపెట్టి అలాటి తిట్లుతిట్టితే సభవారు సహింతురా? పరిషత్తువారికి పంతులుగారియెడల చాలా గౌరవముకద్దు. ఒక సంవత్సరము పంతులుగారిని పరిషద్వార్షికసభకు అధ్యక్షులుగా చేసి గౌరవించినారు. పంతులుగారి మరణమువల్ల దేశమునకు గొప్పలోటు వాటిల్లినదని నెల్లూరిసభలోనే సభవారందరూ లేచి నిలబడి, తమ విషాదమును వ్యక్తపరచి

నారని వార్తాపత్రికలలో ప్రకటించినారు. అందుచేతనే శాస్త్రిులుగారు పంతులు గారి పేరు ఎత్తలేకపోయినారు.

నేను—పంతులుగారు కాలంచేసి అప్పటికి పదిపండ్రెండు రోజులకన్న అధికముకాలేదు; గనుక పేరుపెట్టి తిట్టడము మర్యాదగా ఉండదని మొగమాటముచేత స్పష్టముగా చెప్పక పంతులుగారి పేరు ప్రచ్ఛన్నంగా ఉంచినారు. పంతులుగారి పుస్తకములలోని వాక్యములు, శబ్దములు పుటల వరుసను ఎత్తుకొని జాబితాలువ్రాసి ప్రకటించినప్పుడు పేరుచెప్పకపోతేనేమి? ప్రయోగములనుబట్టి గ్రంథములనున్ను, గ్రంథములనుబట్టి గ్రంథకర్తలునున్ను తెలుసుకోవలెనని కోరికగలవారు తెలుసుకోవచ్చునుగదా.

నా—మీ రనుకొన్నట్లు మొగమాటమూకాదు, ఆచార్లుగా రనుకొన్నట్లు పిరికితనమూకాదు, గడుసుతనము. పంతులుగారిపేరు స్పష్టముగా సభలో తెలియజేస్తే, నోరారా ఇష్టమువచ్చినట్లు వారిని తిట్టనిత్తురా సభవారు? చాలా కాలమయి అణగిఉన్న కోపము వెళ్ళగక్కి కడుపుబ్బు తీర్చుకోవడమునకు శాస్త్రిులుగారికి మంచి అవకాశము దొరికినది. ఈ ఉపాయముచేత కసిదీర్చుకొని సిద్ధసంకల్పులయినారు.

ఆ—సరే కాని, నిందితునిపేరు తెలియజేయకుండా ఎవరినో గ్రంథకర్తను పరోక్షమందు దుర్భాషలాడి శాస్త్రిులుగారు తిట్టుతున్నారనైనా సభవారికి తెలిసినదంటారా లేదా? ఆపని శాస్త్రిులవారికి నైజమైనా, సభలోనున్న సభ్యజనులకు ఏలాగున వినోదకరమైనదో నాకు తెలియదు.

నేను—సభ్యత, మర్యాద కేవల తత్త్వవిచారమందు పాటించకపోవడము గొప్పదోషము కాకపోవచ్చును. గ్రంథకర్త వీరి తిట్లకు పాత్రమైనప్పుడు పరిషత్తువారు శాస్త్రిులవారిని పురికొల్పి వారిచేత ఈలాగున తిట్టించినా అన్యాయ్యమని నేనువాదించను గ్రంథకర్త ఎవడయితేనేమి, అయోగ్యుడైనప్పుడు? వీరేశలింగం పంతులుగారైతే ఆక్షేపించకూడదనిన్ని, ఇతరులెవరైనా అయితే ఆక్షేపించివచ్చుననిన్ని, వివేకులు ఎవ్వరూ అనరు. విమర్శకు విషయము గ్రంథముగాని గ్రంథకర్తకాదు. అయితే, ఆరోపించిన నింద యథార్థమవునా కాదా అని మాత్రము విచారించవలెను.

ఆ—ఆవిచారము పరిషత్తువారు చేయవలసియుండెను, చేసినారా?

నేను—చేయలేదు. శాస్త్రిులువారు చదివిన అధ్యక్షోపన్యాసముమాత్రము కొంతకాలము గడిచిన పిమ్మట పరిషత్పత్రికలో ప్రకటించినారు. గాని ఇప్పటికిన్ని—

నా—ఆంధ్రపత్రికలో మాత్రము వెంటనే ప్రకటించినారు; గాని, మీరన్నట్టు ఇప్పటికిన్ని శాస్త్రిలుగారు ప్రకటించిన అపవాదము ఎవ్వరును విమర్శించలేదు.

ఆ—పరిషత్తువారు, సభవారు, పరిషత్పత్రికాసంపాదకులు, ఆంధ్ర పత్రికా సంపాదకులు ఈ పత్రికలు చదివినవారు—వీరందరూ ఉపేక్షించి ఊరకున్నందున అపవాదము స్థిరపడినట్టే అయినది. పండితు లందరూ నిరుత్తరులయి మౌనము వహించినట్టే వీరేశలింగంపంతులుగారి కీర్తి కళంకిత మైనదన్నమాటే. ఆహా! పంతులవారితోకూడా పంతులవారియెడల లోకుల కున్న గౌరవము, అభిమానము, అనురాగము-అన్నీ చచ్చినట్టే—

నా—అలాగనడం ధర్మంకాదు. వీరేశలింగం పంతులుగారిమీద శాస్త్రిలుగారు ఈ నింద మోపినారని ఇంకా ఎవ్వరికీ తెలియలేదు. ఒక్క రామమూర్తిపంతులుగారు మాత్రము తెలుసుకొన్నారు.

ఆ—వీరైనా పంతులుగారి కీర్తికి కళంక మంటకుండాచేస్తే లోకమంతా సంతోషిస్తారు.

నేను—పంతులవారి కీర్తి ప్రతిష్ఠలనుగురించి మనకంత ఔత్సుక్యముండనక్కరలేదు. వాటికి ఆధారము కేవలము సత్యము. సత్యము శాశ్వతము. సత్యము అసత్యముగాను, అసత్యము సత్యముగాను అవివేకులు ప్రకటించినా సత్యాసత్యములు తారుమారు అయిపోవు, గాని కొంతకాలము కొంత హాని కలిగితే కలుగవచ్చును. సదాచారమును దురాచారమని నిందించడము వంటిదే సుశబ్దము అపశబ్దమని దూషించడము కూడాను. అందువల్ల లోకులు సదాచారమును విడిచి దురాచారము అవలంబించినట్లే సుశబ్దాలు విడిచి అపశబ్దాలు వాడుతారు. ఇప్పుడు నేను రచించిన ఈ వ్యాసములో నాకు తెలిసినంతమట్టుకు సత్యమే ప్రకటించినాను. వీరేశలింగం పంతులుగారు ప్రయోగించిన శబ్దాలలో ఏవి విప్రయోగములని శాస్త్రిలుగారు నిందించినారో అవి ఒక్కొక్కటి శ్రద్ధగా విమర్శించి చూచి ఏవి సాధువులని తెలుసుకొన్నానో అవి సాధువులని ఋజువుచేసినాను. శాస్త్రిలుగారి వాదములోని దోషములు నాకు కనబడ్డంతమట్టుకు చూపించినాను. ఏవో కొన్ని అంశములు మినహాగా మొత్తముమీద శాస్త్రిలుగారి అపవాదము నిరాధారముగా నాకు తోచినది.

ఆ—మంచిపనిచేసినారు. అయితే మరి వేంకటరాయ శాస్త్రిలవారు గొప్ప పండితులని లోకములో ప్రసిద్ధిగదా. సుశబ్దమేదో అపశబ్దమేదో తెలుసుకోకుండా గొప్ప సభలో సాటి పండితుణ్ని గురించి మిథ్యాపవాదము ప్రకటించుటకు సాహసించినారేమి?

నా—ఆయన స్వభావమండీ అది, ఇరవైయేండ్ల క్రిందట కొక్కొండ వెంకటరత్నం పంతులుగారినిగురించి ఈలాగే శాస్త్రిలుగారు మిథ్యాపవాదము ప్రకటించినారు. ఆపంతులుగారు తెలిగించిన ప్రసన్నరాఘవములోని సుశబ్దాలే కొన్ని అపశబ్దాలని దూషించి గ్రంథకర్తను అతినీచముగా తిట్టినారటండి అన్నట్టు—రెండేండ్ల క్రిందట మన రామమూర్తి పంతులుగారే తమ తెలుగు పత్రికలో "పండిత భిషక్కుల భాషాభేషజము" అని పేరుపెట్టి ఒక వ్యాసము రచించి శాస్త్రిలుగారి విమర్శము విమర్శించి, సత్యము ప్రకటించినారండి—అయ్యా పంతులుగారూ! మీరు వ్రాసినదానికి ప్రత్యుత్తరమేమైనా శాస్త్రిలుగా రిచ్చినారా?

నేను—లేదు. నా వాదము ఖండించి వారు ఏమైనా వ్రాసేయెడల నాపత్రికలో ప్రకటిస్తానని కబురు పంపినాను. అయితే వారు ఊరకున్నారు.

ఆ—ఊరుకోక ఏమిచేస్తారు? మీ పత్రికసాగకుండా ఆగిపోవడము దురదృష్టమండీ.

నా—వారిని ఏమిచేయమన్నారు? మొదటి సంపుటము 12 సంచికలు అచ్చువేయించిన ఖర్చులయినా చందాలవల్ల రాలేదు. సాయము చేస్తామన్నవారు ఉపేక్షించినారు. కొందరు చందాలియ్యనేలేదు. భాషాభిమానముగలవారు లేరండీ. ఈయన పత్రికవల్ల వ్యావహారికభాష అపరిహార్యమనిన్ని అపరిమిత ప్రయోజనమైనదనిన్ని రుజువయినది సుమండీ.

నేను—"గ్రాంధికభాష" అనేది కృతకభాషగాని వాస్తవమైనది కాదని స్పష్టపరచినాను. గ్రాంధికాంధ్రమనేదానిలో కొంత పూర్వులు వాడిన భాష, కొంత మనమువాడుకొనే భాష కలిసి ఉంటుంది. మనము వాడుకొనే మాటలలో ఏవి పూర్వుల గ్రంథాలలోకూడా ఉన్నవో అవే సాధువని పండితులంటారు. పూర్వులు రచించిన గ్రంథాలన్నీ చదివి, వాటిలోని శబ్దాలు జ్ఞప్తియందుంచుకొన్నవారికిగాని ఇట్టి వివేకము కలుగదు అట్టి వివేకముగల భాషాపండితులు అరుదు. మన వాడుకలో ఉన్నమాటలుగానీ, లేనిమాటలుగానీ ఎవరైనా బుద్ధిపూర్వకముగానో ప్రమాదముచేతనో మార్చివేస్తే, తప్పో ఒప్పో తెలుసుకోవడం కష్టం. అందుచేత కృతకభాష నిరాక్షేపముగా పుస్తకాలలోనికి ఎక్కుతున్నది.

ఆ—కృతకభాష అంటే ఏమిటి? బాగా తెలిసిందికాదు.

నేను—వాస్తవమైనది కాదన్నమాట; ప్రాచీనాంధ్రగ్రంథములలోగాని, నేడు మన వ్యవహారములోగాని ఉన్నభాషవాస్తవమయినది. అందులోగానీ ఇందులోగానీ లేనిది కృతకభాష; కేవలకల్పితం. శరణుచొచ్చుము, ఏతెంచ

వలెను, దొఱుకదు, ఊరునకు, అచ్చటకు, అచ్చటునకు పంద్రెండ్రుగురు—ఈలాటివి వందలు వందలుగా పెద్దపేరుగల పండితుల గ్రంథాలలో ఉన్నవి.

ఆ—ఎక్కడాలేని శబ్దాలు పండితులు ఎందుకు కల్పించి వాడుతారు? ఇతరులు ఆలాగున కల్పించరే.

నేను—అవును; ఆపనిచేసేవారు పండితులే. వ్యావహారికభాష గ్రామ్యమని దానిలోని శబ్దాలు వారు ముట్టుకోరుగదా! ప్రాచీన గ్రంథాలలోని శబ్దాలు సుపరిచితమైనవికావుగనుక చట్టున ఎవరికీ జ్ఞప్తికి రావుగదా. ఏవో శబ్దాలు లేనిదీ గ్రంథంసాగదు. అందుచేత, వ్యావహారికభాషలోనిశబ్దాలే అచ్చో, హల్లో మార్చి గ్రామ్యత్వము తొలగించి, గ్రాంధికీకరణముచేసి ప్రయోగిస్తారు. మన పిల్లలు బడులలో చదువుకొనే శిశుబోధలు, బాలబోధలు, కృతకభాషలో రచించినవే. ఇవిచదివి గ్రాంధికాంధ్రమునేర్చుకొని, పెద్దవాళ్లయినపిమ్మట, అలాటి కృతకభాషలోనే గ్రంథాలు రచిస్తున్నారు. ఈ యాభైయేండ్లలో ఈదురభ్యాసము దేశమంతటా వ్యాపించినది మన తండ్రులకాలములోనూ మన తాతలకాలములోనూ లేదు. మన పురోహితులూ యాజకులూ దోషభూయిష్ఠములుగా మంత్రాలూ శ్లోకాలూ చదువుతూ మనచేత కర్మలూ వ్రతాలూ చేయిస్తూఉంటారుగదా! వాటిలోని తప్పొప్పులు మనకు తెలియకపోయినా ధన్యులము, కృతకృత్యులము అయినామని తృప్తిపొంది దక్షిణ సమర్పించి నమస్కారము చేస్తున్నామా లేదా? ఆలాగుననే గ్రాంథికాంధ్రము చదువుకొని అందరూ తరిస్తున్నారు.

ఆ—నాకు బాగాబోధపడక అడుగుతున్నాను. కోపంపడకండి. మా వాళ్ళద్రావిడం అలాగేఉంటుంది: అవి దేశ భాషలుకావు. తెలుగులో లేని శబ్దాలు కల్పించి ఒకరు వాడితే, కనుక్కొని బయలుపెట్టి బుద్ధిచెప్పేవాడు ఒకడైనాలేడండీ! అందరిదీ గుడ్డిపాండిత్యమే? భాషాభిమానమున్నట్లే అందరూ కేకలువేస్తారు. గ్రాంధికభాషాసంరక్షకసమాజాలు, సాహిత్య పరిషత్తులూ, పత్రికలూ— ఇవి అన్నీ ఏమిచేస్తూఉన్నట్టు?

నా—వ్యావహారికభాష నిష్ప్రయోజనముగాచేసి, గ్రాంథికభాషను రూపుమాపి, కృతకభాషను వ్యాపింపజేస్తూ గొప్పపనిచేసినట్టు వీరంతా బడాయిచెప్పుకొంటున్నారు. మాతృభాషాభిమానమంటే లోకులు వాడుకొంటూఉన్నభాషను నిందించడము, లోకవ్యవహారమందు లేనిభాషను స్తుతించడమున్ను—అంతే. పరిచయముగలచోట అనాదరమూ, పరిచయములేనిచోట వ్యామోహమూ అవివేకమూలమే.

ఆ—నేనడిగినమాటకు జవాబుచెప్పినారుకారు. ప్రాచీనాంధ్రగ్రంథాలు చదవని నాలాటివాళ్ళు తప్పులువ్రాస్తే, పండితులైనా కనుక్కోలేరటండీ?

నా—వేంకటరాయశాస్త్రిలవారు సరీగా తప్పొప్పులు కనుక్కోఁగలిగినారా? ఆయనలాటిపండితులేగదా అందరున్ను.

నేను—కాదు కాదు; అనేకులు ఆయనకంటె తక్కువవారే అనవలెను. ఆయనకంటె ఎక్కువపండితులుంటే వారు ఉపేక్షించి ఊరకొన్నారేమో?

నా—అంతటి పండితులయినా భారతములో ప్రచురముగా ఉన్న శబ్దములే వేంకటరత్నం పంతులుగారున్ను, వీరేశలింగం పంతులుగారున్నువాడితే, తెలియక అది తప్పని వారిని పడతిట్టినారు; చూచినారా?

నేను—మరి, శాస్త్రిలుగారే నావాదము చాలామట్టుకు బలపర్చినవారయినారు సుమండీ!

ఆ—ఏలాగునండోయ్?

నేను—1898 వ సం॥లో ప్రకటించిన ప్రసన్నరాఘవ విమర్శము యొక్క అవతారికలోను, 1919 వ సంవత్సరమందు నెల్లూరిసభలో చదివిన అధ్యక్షోపన్యాసము యొక్క అవతారికలోను, శాస్త్రిలుగారేమిచెప్పినారో చూస్తే తెలుస్తుంది. రెండింటిలోను మొదటివాక్యాలు చదువుతాను వినండి.

ప్రసన్నరాఘవవిమర్శమందు—"ఈకాలములో ఆంధ్రభాషలో ప్రబంధములు పెచ్చు పెరుగుచున్నవిగదా. వీనిలో అనేకములవలన భాషకు కడుంజెట్ట కలుగుచుండుటంగాంచి ఏదేనొకగ్రంథ మాధారముగా నీచెఱుపునెల్ల విద్యార్థిజనోపయోగముకై భాషారక్ష వెల్లడిసేయఁ దలంపుగొన్న వాఁడనై, అట్టియిప్పటిగ్రంథములలోనెల్ల మ. రా. శ్రీ. కొక్కొండ వేంకటరత్నము పంతులవారు రచియించిన యాంధ్రప్రసన్నరాఘవము నాయుద్యమమున కత్యంతోపయుక్తముగా నున్నందున దానిని విమర్శింప దొరఁకొంటిని" అని వ్రాసినారు.

నా—తెలిసిందా? ఆచార్లుగారూ! గ్రాంథికాంధ్రము బాగారానివాళ్లు గ్రంథాలురచించి భాషపాడుచేస్తూ ఉన్నారని శాస్త్రిలుగారు నిందించడం వేంకటరత్నంపంతులుగారిని ఒక్కరినేకాదని స్పష్టమైనదిగదా! ఆపంతులుగారివంటివారికి అనేకమందికి ప్రతినిధిగా ఆయనను ఎంచుకొని, అందరికీ చేయవలసిన శిక్ష ఆయనకు చేసినారు.

ఆ—ఆశిక్షవల్ల ఇట్టి పండితులుచేసే నేరాలు కొంతైనా తగ్గినవా; గ్రాంథికాంధ్రమురానివాళ్లు గ్రంథాలు రచించడము మానుకొన్నారా. ఆపిమ్మట నైనాను?

నేను—శాస్త్రిలుగారి వాక్యములోనే ఉన్నది మీప్రశ్నకు జవాబు. వారి అధ్యక్షోపన్యాసము సాహిత్యపరిషత్పత్రికలో ఉన్నది. ఇవిగో ఈ బీరువాలోనే ఉన్నవి సంచికలన్నీ; అవి తీసి చదువుతాను: వెంకటరత్నం పంతులుగారికి

శాస్త్రిలుగారుచేసిన శిక్షవల్ల ఇతరులకెవ్వరికీ బుద్ధివచ్చినట్లు కనపడదు. ఈ యిరవై యేండ్లలోను మరింత అధికముగా నేరాలు జరిగినవట.

నా—గ్రాంధికాంధ్రము బాగారానివాళ్ళకు తమకు తెలిసిన విషయములు పుస్తకాలలో వ్రాసి ప్రకటించవలెననే కోరిక మిక్కుటముగా ఉన్నప్పుడు, వారు అపరిచితమయిన గ్రాంథికాంధ్రములో వ్రాయక, సుపరిచితమయిన వ్యావహారిక భాషలో వ్రాస్తే, గ్రాంథికాంధ్రభాష మరి పాడుకాదు. వ్యావహారికభాష చక్కపడుతుంది. అందువల్ల లోకానికి చాలా మేలుకలుగుతుంది.

ఆ—అలాగయితే, గ్రాంధికాంధ్రము వ్రాసేవాళ్లు అట్టే వుండరు; అందరూ వ్యావహారికభాషలోనే గ్రంథాలు రచిస్తారు. అవి—

నా—రచిస్తే లోకము మునిగిపోతుందా ఏమి? మరీమంచిది. పుస్తకాలు చదువుకోవడం సులభముగా ఉంటుంది, అక్షరాలు నేర్చుకొన్నవాళ్ళందరికీ కావలసినన్ని పుస్తకాలు దొరుకుతవి. ప్రజలలో విద్య వ్యాపిస్తుంది. దేశము అభివృద్ధి పొందుతుంది. అందువల్ల అన్నివిధాలా లాభమేకాని నష్టమేమీలేదు.

ఆ—మరి గ్రాంధికాంధ్రము గతి?

నా—గ్రాంధికాంధ్రము ఆంధ్రపండితులు గుత్తగొన్నది. ఇతరులు దాని జోలికి పోగూడదు. అది సంస్కృతమువంటిది. ముందుగా భాష బాగా నేర్చుకొంటేనేగాని, గ్రంథరచనకు అధికారము కలుగదు. పదేండ్లయినా కష్టం పడకుంటే భాష పట్టుపడదు.

నేను—అవును; అయినవాళ్ళూ కానివాళ్ళూ దానిని చేపట్టడముచేతనే దానికి సంకటాలు తగిలినవట. ఇదిగో! వినండి శాస్త్రిలుగారి ఉపన్యాసమునకు అవతారిక:

"ఈ కాలమందెల్లెడలను భాషాభివృద్ధి యగుచున్నదని ఘోషాభివృద్ధి వినఁబడుచున్నది. ఆయభివృద్ధివాపో, బలుపోయనిన—వాపు ప్రత్యక్షమే, మఱి నాడిని బరికింపఁగా, నాంధ్రసాహిత్యపరిషదుద్దేశ్యములలో సూచితమై విజ్ఞానసర్వస్వాదిమహోద్యమములలోను, నాంధ్రులచరిత్రము లోనగు గ్రంథములలోను బరిషత్పత్త్రికాంధ్రపత్త్రికా హితకారిణ్యాది పత్రికలలోనూ బ్రస్ఫుటమై శ్రీ సూర్యరాయ ప్రభునిర్మిత్సిత బృహన్నిఘంటు ప్రస్తావనలం దస్ఫుటమై బలుపు నాడియు నాడుచునే యున్నది.

"మఱి వాపు ప్రత్యక్షమేయైనను, చికిత్స సేయుటకై నిదానాదికము నరయవలయును. అందుల నిదాన మాధునికవాఙ్మయమే. దినము తప్పక గంట తప్పక శైశవప్రభృతి ఆకౌమారము భాషాదేవతకుఁ బుస్తక నిర్మాతల సంఖ్యే

యులు యథాప్రజ్ఞము ప్రయోగించిన విషములచే ధాతువులు సెడి నంజుగలిగి వాపెక్కి మన చేతితో నెటనదిమినను దాని రేఖలుగూడ స్ఫుటముగాఁ గాని పించుచు లొత్తలు పడుచున్నవి."

నా—ఆచార్లుగారూ! చూచినారా పరాచకాలు? ఉపన్యాసమంతటా ఇట్లానే—

నేను—పరాచకాలమాటకేమి? నా వాదమునకు అనుకూలముగా ఉన్న దాలేదా శాస్త్రిలవారి సాక్ష్యము? మీ ప్రశ్నకు జవాబుకూడా ఈ వాక్యములోనే ఉన్నదిగదా?

నా—అవునండి, నాకు తెలిసిన సారాంశము చెప్తాను. 1898-వ సం॥ లో వెంకటరత్నం పంతులుగారివంటి దుష్టప్రబంధ నిర్మాతలు అనేకులున్నారు. 1919-వ సం॥లోకూడా వీరేశలింగంపంతులుగారివంటి దుష్టప్రబంధ నిర్మాతలు అసంఖ్యేయులు. గ్రాంథికాంధ్రము ఒక్క వేంకటరాయ శాస్త్రిగారికే కాని మరి ఎవఁకీ రాదుగాబోలు!

నేను—ఆ విషయముకూడా నా వాదమునకు అనుకూలముగానే శాస్త్రి లవారి విమర్శలోని దోషములవల్లనే రుజువైనది. చూడండి.

ఆ—బలుపునాడి ఆడడముమాట?

నేను—అది వేరే విషయము. దానినిగురించికూడా చెప్తాను. ఇప్పుడు నేను సూచించినది వినండి. గ్రాంథికాంధ్రము చక్కగా రానివారు గ్రంథాలు రచిస్తున్నారనిన్ని, అట్టి గ్రంథకర్తలు "అనేకులు" "అసంఖ్యేయులు" అనిన్ని, వారు రచించిన గ్రంథములు పెచ్చుపెరుగుచున్నవనిన్ని, "భాషాభివృద్ధి అగుచున్నదని ఘోషాభివృద్ధి మాత్రమే వినబడుచున్న"దనిన్ని, శాస్త్రిలుగారు రుజువు చేసి ప్రకటించినారు. దానికి తోడు నేను ప్రకటించేదేమిటో తెలిసినదా? గ్రాంథికాంధ్రము రానివాళ్ళు గ్రంథకర్తలుమాత్రమేకాదు, గ్రంథ విమర్శకులు మన శాస్త్రిలుగారి వంటివాళ్ళుకూడా అలాటివాళ్ళే అని. గ్రంథకర్తలకురాదు, గ్రంథ విమర్శకులకురాదు. గ్రంథపాఠకులకు, పఠకులకూరాదు. మరి ఈ గ్రాంథికభాష వచ్చినవారు ఎవరున్నారో, ఎక్కడనున్నారో నాకు తెలియదు.

ఆ—బలుపునాడికూడా ఆడుతున్నదట, ఏవో కొన్నిచోట్ల?

నేను—అదికూడా తెలుసుకోలేక చెప్పినమాటే. మన పండిత భాషజ్ఞులు విదానముచొప్పున విజ్ఞాన సర్వస్వము, ఆంధ్రుల చరిత్రము, పరిషత్పత్రిక, ఆంధ్ర పత్రిక మొదలయిన వాటిలో విషప్రయోగములు లేవట! ఐతే దుష్ట ప్రబంధ నిర్మాతలు, ప్రయోగించిన శబ్దములలో ఏవి విషప్రయోగము లని వీరు నిందించినారో అవి ఈ నాలుగింటిలో కూడా నాకు కనబడ్డవి. నా

విమర్శములో కొన్ని చూపించినాను. వీరి భేషజాలు ఎంత మోహకమయి నవో చూడండీ! ఎవ్వరికీ తెలియని విషయంలో అందరూ బాగా తెలిసినట్టే నటిస్తారు.

నా—ఇదికూడా వీరి వాదమును బలపరచినట్టేకదా, ఆచార్లుగారూ!

ఆ—అవును. రెండువిధాలాను. 'నిర్దుష్టమైన గ్రాంధికాంధ్రమున రచించిన గ్రంథాలు సుతరాం లేకపోలేదు, కొద్దిగానైనా ఉన్న'వనిగదా ఈ నాలుగున్ను శాస్త్రులుగారు పేరుకొన్నారు? ఇవికూడా దుష్ట ప్రబంధవర్గములో చేరవలసినవే అని రామమూర్తి పంతులుగారు రుజువుచేయడముచేత 'నిర్దుష్టమైన గ్రాంధికాంధ్రగ్రంథము నేటి గ్రంథాలలో ఒక్కటైనా ఉన్నదా' అని పంతులుగారు వేసిన ప్రశ్నకు ప్రత్యుత్తరము పండితులమీద అప్పుగా నిల్చి ఉన్నది. పరిషత్తువా రుత్తరవాదులు.

నా—మీరు "రెండువిధాలా" అన్నారే; రెండోవిధమేది?

ఆ—గ్రంథాలు విమర్శించి సాధుత్వాసాధుత్వాలు నిర్ణయించే సామర్థ్యము శాస్త్రులుగారికి లేదని ఇందువల్లకూడా రుజువు కాలేదూ? ఐతే, పంతులుగారూ! గ్రాంథికభాష మీరు బాగా అభ్యసించినవారుగదా! ఒకగ్రంథమైనా రచించి మీరు ప్రకటించినారు కారేమి?

నేను—నాకు గ్రాంథికాంధ్రము పూర్తిగా రాదండీ. వచ్చీరాని భాషలో స్వేచ్ఛగా రచనసాగదు; భావాలు స్పష్టముగా తెలియజెప్పడం కష్టము. ఎంత జాగ్రత్తగాఉన్నా తప్పులు పడవచ్చును. 'నుయిదాటేవానికిన్ జింతయా కంతైనన్ గడమేనియుం గడమగాదా' అన్నాడు రామకృష్ణ కవి.

నా—కొంతకాలము క్రిందట మన రామమూర్తి పంతులుగారు 'ప్రాఁదెలుఁగుఁగమ్మ' అని ఒక ఉత్తరముౘ్రాసి పరిషత్పత్రికలో ప్రకటించినారు. దానికి సరిగా అర్థం చెప్పలేక కొందరు హాస్యాలు చేసినారు.

నేను—ఎంతో ప్రయత్న పూర్వకముగా అది వ్రాసినాను. దానిలో బుద్ధిపూర్వకముగానే అపశబ్దాలు కొన్ని దూర్చినాను. అబుద్ధిపూర్వకముగా ఎన్ని వాడినానో నాకే తెలియదు. పండితు లెవరైనా తప్పులు కనుక్కుంటారో లేదో చూతామనే అలాగున వ్రాసినాను. ఎవరూ కనుక్కోలేదు. త్రికరణశుద్ధిగా నాకు తోచినట్టు నిజము చెప్తున్నాను; నమ్మండీ! సిగ్గూ, లజ్జా ఉన్నవాళ్ళయితే, మన వంటివాళ్ళు "గ్రాంథిక భాషలో" గ్రంథాలు రచించకూడదండి. అపరిచితమైన భాష వాడినప్పుడు ప్రమాదము సంభవించక మానదు. తప్పులెప్పుడైన పడకపోవు. అపకీర్తి తప్పదు. నిత్యమూ వాడుకొనే భాషలోనైనా చక్కగా

అభ్యాసము చేసుకొంటేనేకాని వాక్యవిన్యాసము కుదురుగా ఉండదు. ఔచిత్యమూ అనౌచిత్యమూ లోకమునుపట్టి తెలుసుకోవలెను. ఒక వృత్తాంతము తార్కాణముగా చెప్తాను వినండి.

ఇంగ్లీషునవలలు రచించినవారిలో చాలా ప్రసిద్ధి పొందిన 'థ్యాకరే' అనే ఆయన 1852-వ సం॥లో ఎజ్మండ్ అనే నవల రచించినాడు. అప్పటికి 150 సం॥ల క్రిందటనున్న వాడుక భాష అందులో వినోదార్థము వాడినాడు. ఆభాష అతడు ఎంతో ప్రయాసపడి అలవర్చుకొన్నాడు. ఆ భాషయొక్క కట్టుబాట్లు బాగా తెలియక అనేకులు ఆనవలను చాలా మెచ్చుకొన్నారు; గాని, అతనిమిత్రుడే ఒకడు అందులోని తప్పులు చూపించి ఆక్షేపించినాడు. అప్పుడు థ్యాకరే సిగ్గుపడి, అటువంటి అవివేకపు పని మరిచేయక తనకు సుపరిచితమైన తనకాలపు వాడుక భాషలోనే గ్రంథములు రచించినాడు.

ఆ—అయితే, ఇంగ్లీషువారు తమ వాడుకలోని గ్రాంథికభాషలో గ్రంథములు వ్రాయడం లేదంటారా ?

నేను—లేదనే చెప్పవలెను. సర్వసాధారణముగా గ్రంథకర్త లందరూ తమకాలపు భాషలోనే గ్రంథములు వ్రాస్తున్నారు. కొంతకాలము క్రిందట ఇంగ్లండ్ దేశములోకూడ, మన పండితులవంటివారు కొందరు స్పెన్సరు మొదలయినవారు తమకు సుపరిచితముకాని "ప్రాచీన గ్రాంధిక" భాషలో గ్రంథములు రచిస్తూ ఉండేవారు; తప్పులుచేస్తూ ఉండేవారు; థ్యాకరేవలెనే పరాభవము పొందుతూవుండేవారు. పార్లమెంటు సభలో కొందరు డాంబికులు తమకు వచ్చీరానీలాటిన్ భాషాపదములు తమ ఉపన్యాసములలో వాడుతూ ఉండేవారు. అందులోని తప్పులు అసందర్భాలు చూపించి కొందరు డాంబికుల దుష్పాండిత్యము బయలుపెట్టుతూ ఉండేవారు. అందుచేత, సుపరిచితమైన వ్యావహారిక భాషలోనే గ్రంథరచన చేయవలెనన్న కోరిక అంతకంతకు ప్రజలలో విద్య వ్యాపించినకొద్దీ ఎక్కువయినది. ఇప్పుడు ఇంగ్లండు దేశములో కోట్లకొలది పుస్తకాలు ప్రకటిస్తున్నారు. అన్నిటిలోనూ ఇప్పుడు వ్యవహారములో ఉన్న భాషేకాని ప్రాచీనభాష కనబడదే.

ఆ— అయితే మన దేశమం దెక్కడచూచినా పుస్తకాలు గ్రాంథిక భాషలోనే కనబడుతున్నవే. ఈ సంప్రదాయము-

నేను—సరే, మీరడిగే ప్రశ్న. వినండి దానికి జవాబు చెప్తాను. మన పూర్వుల సంప్రదాయము చొప్పున రచించిన తెలుగు గ్రంథాలు వేలకొలదిగా ఉన్నవి. గవర్నమెంటువారు, పరిషత్తువారు, ఇంకా మరికొందరు వాటి ప్రతులు సంపాదించి గ్రంధాలయములలో పెట్టి ఉంచినారు. మనుచరిత్ర, వసుచరిత్ర మొదలయిన ప్రబంధాలు తప్ప తక్కినవన్ని వాడుకభాషలోనే రచించినారని

ఆ ప్రతులు చూస్తే తెలుస్తుంది. బాలసరస్వతివంటి పండితుడుకూడా ఆంధ్రశబ్ద చింతామణి అనే వ్యాకరణమునకు వ్యావహారికభాషలోనే టీక వ్రాసినాడు. అప్పకవీయములోని వివరణమంతా వాడుకభాషలోనే ఉన్నది. 1859 వ సం॥లో మొట్టమొదట అచ్చువేయించినవారు గ్రాంధికభాషలోనికి మార్చివేసినారు. అప్పటినుండి ఇప్పటిదాకా ఆలాగుననే పునర్ముద్రితమయినది. అయితే తాటాకు పుస్తకాలుచూచి వాటిలో ఉన్నట్లుగా గ్రంథమంతా దిద్ది ఆ గ్రంథము వావిళ్ళ వారిచేత నా కొమారుడు ఇప్పుడు అచ్చువేయించినాడు. అప్పకవీయపీఠికలో ఈ విషయము సవిస్తరముగా అతడు చర్చించినాడు, అదిచదివితే లెస్సగా తెలుస్తుంది. బడులలో పిల్లలు చదివే పుస్తకాలుకూడా పూర్వసంప్రదాయము చొప్పున వ్యావహారికభాషలోనే రచించి అచ్చువేయించేవారు. వాటిలో కొన్నింటి ప్రతులు నావద్దనున్నవి. కావలిస్తే చూపిస్తాను. ఉత్తరాలు వ్రాసినట్లే గ్రంథాలు రచించేవారండీ మన పూర్వులు! అందరికీ తెలిసేటట్టు కథలూ, కాలక్షేపాలూ, పాటలూ, పదాలూ.

ఆ—అన్నట్టు జ్ఞప్తికి వచ్చినది. మాయింట్లోనే ఉన్నవండీ కొన్ని పుస్తకాలు అటువంటివి. వైకుంఠ మహాత్మ్యం, ప్రసన్న పరిత్రాణం, సాత్విక బ్రహ్మ విద్యావిలాసం-ఇవి అన్నీ వాడుకభాషలోనే ఉన్నవండీ. ముముక్షు జన కల్పకములో పద్యాలు గ్రాంథికభాషలోఉన్నా టీక వాడుకభాషలోనే ఉన్నది సుమండీ!

నా - మీ పూర్వులేకాబోలు తాతాచార్యులుగారు. వారు చెప్పినకథలట బ్రౌనుదొరగారు అచ్చువేయించినారు. వాడుకభాషలో మాట్లాడినట్లు రచించినారు. మీ పొట్టనిండా కథలే. వాటివల్లనే మీపొట్టనిండుతూఉన్నది గదా. తాతాచార్యులుగారు వ్రాసినట్టే మీరుకూడా వ్రాసి మీకు వచ్చిన కథలన్నీ అచ్చువేయించరాదూ, అందరూ కొనుక్కొని చదివి సంతోషిస్తారు.

ఆ - ఇప్పటివారికి గ్రాంథికభాషేకాని గ్రామ్యభాషే రుచించదటండీ. కాశీమజిలీలు మొదట ఏలూరిలో గ్రామ్యభాషలోనే అచ్చువేయించినా, ఇప్పుడు అవి గ్రాంథిక భాషలోనే అచ్చుపడుతున్నవి. కథలు నోటను చెప్పినప్పుడు గ్రామ్యభాష వినడానికి ఇంపుగానే ఉంటుందట గాని పుస్తకములు చూచి చదివినప్పుడు బాగుండదట! గ్రాంథికభాషలో ఉంటేనేకాని గ్రంథముకాదని చాలా మంది అనుకొంటారు, స్త్రీలకుకూడా గ్రాంథికభాషమీదనే ఎక్కువ మక్కువ సుమండీ, పల్లెటూళ్ళలోకూడా తెలిసినా తెలియకపోయినా గ్రాంథికభాషలో ఉన్న పుస్తకాలే అందరూ కొని కూడబలుకుతూ చదువుతారట!

నా—మా పిల్లవాణ్ణి ఏదైనా ఒక కథ చెప్పమని నేను అడిగితే, ఆనంద వాచకములలో తానదివరకు చదివిన కథ ఒకటి అందులో ఉన్నట్లే పాఠము

అప్పగించినట్లు ఏకరువుపెట్టినాడు. వాడికి ఆ కథ ఏమీ బోధపడలేదని కొన్ని ప్రశ్నలకు వాడిచ్చిన జవాబువల్ల తెలిసినది. అయినా, మావాళ్ళందరూ వాడి పాండిత్యానికి చాలా మెచ్చుకొన్నారు. వాడు పుస్తకములోని కథలు చదువుతూ ఉన్నప్పుడు వాడి తమ్ములుగాని చెల్లెళ్ళుగాని వాడివద్ద కూర్చుని వినరు. మా అమ్మ కథలుచెప్తూవుంటే, అందరూ ఆవిడచుట్టూ కూర్చుంటారు.

నేను—యూరోపులోను. అమెరికాలోను అయిదారేళ్ళ పిల్లలుకూడా ఆసక్తితో వినేటట్టుగా రచించిన కథల పుస్తకాలు వందలూ వేలూ ఉన్నవి.

ఆ—అదేమి రుచో నాటకాలలోకూడా పాఠము అప్పగించినట్టే ఉంటుంది సంభాషణ. మాట చెవిని పడ్డప్పుడు వెంటనే దాని అర్థమున్ను రస మున్ను అందరి మనస్సులలోను స్ఫురించనప్పుడు నాటకమువల్ల లాభమేలేదు. పురాణములోని శ్లోకాలో పద్యాలో చదివినప్పుడు అందరూ అర్థం చేసుకోలేకనే కదా వాడుక మాటలలో వాటికి అర్థం చెప్పడము ఆచారమైనది. నాటకాలలో పాడే పద్యాలకు ఎవరూ అర్థం చెప్పరే?—

నేను—నాటకాలమాట తలపెట్టినారు గనక జ్ఞప్తికి వచ్చినది. తంజావూరి రాజుల కాలములో పండితులు రచించిన నాటకాలు 60 కి పైగా ఉన్నవి. వాటిలో సంభాషణ ఆకాలపు తెలుగులోనే రచితమైఉన్నది సుమండీ! వాడుకలో నున్నట్లు భాష గ్రంథములో కనబడితే, ఇప్పుడు రుచించదని మీరు చెప్పినారే - అదే గ్రాంధిక భాషవల్ల మనదేశానికి కలిగిన గొప్పకీడు. హితమైనది, అప్రియమైనది. పిల్లలకు పంచదార చేదయినది; పొగాకు మసాలావేసిన కారపు బీడీలే కావలెను. రుచి మరగినారు. రవీంద్రనాథ ఠాకూరుగారు ఈ విషయమై మోడరన్ రివ్యూలో ఏమని వ్రాసినారో చూడండి.

ఆ—అది ఇంగ్లీషు కాబోలు?

నేను—నాయుడుగారు తెలుగున వివరించి చెప్తారులెండి.

"The artificial language of a learned mediocrity inert and formal, ponderous and didactic, devoid of the least breath of creative vitality is forced upon our boys at the most receptive period of their life. It is every day be-coming a more formidable abstcle in the way of our boys' acquiring that mastery of their mother tongue which is of life and literature."

నా—మీరిప్పుడు చెప్పిన సంగతేనండి రవీంద్రనాథ ఠాకూరుగారి వ్యాసములో ఉన్నది. పండితంమన్యుల కృతకభాషలో జీవకళ ఏమీ ఉండదట! దానివల్ల అర్థమూ, భావమూ, రసమూ ఏమీ స్ఫురించవట! మా పురోహితుడు

చెప్పే మంత్రాలలాగున ఉంటుదట! మనపసిపిల్లలు ఏది మంచిదోఏది చెడ్డదో స్వయం తెలుసుకోలేరు. దగ్గిర ఉన్నవాళ్లు ఏది మంచిదంటేఅదేమంచి దనిన్ని, ఏదిచెడ్డదంటే అదేచెడ్డదనిన్నీ అనుకొంటారు. వారిబుద్ధి లేత మొక్కలాగుం టుంది; ఎటువంచితే అటేవంగుతుంది. అట్టిఅవస్థలోపిల్లలు ఉన్నప్పుడు వాడు కలో ఉన్నభాష అయోగ్యమైనదనిన్ని, కృతకభాష యోగ్యమైనదనిన్నీ, తోచే టట్టు శిశుబోధలూ. బాలబోధలూ మొదలుకొని వాళ్ళుచదివే అన్నిపుస్తకాల లోను వాడుకలో ఉన్నమాటలు వాడకుండా వాటికి మారుగా ఏవో వ్యత్యస్త ముగా ఉన్నవీ, లోకములో పండితులయినా ఎన్నడూ వాడనివీ, కొన్ని కల్పిం చినవీ, కొన్ని ప్రాచీనగ్రంథాలలోనివీ కూర్చి, డాబుగా వింతభాష పుట్టించి నేర్పుతున్నారట ! చిన్నప్పుడు తినమరిగినదే తియ్యగా ఉన్నట్టు కృతకభాషే విద్యార్థులకు రుచించేది అయినది. సాజమైన లౌకికభాషమీద ఉండవలసిన అభిమానము పోయినది. వట్టి వేషాలు వాలకాలు ఇష్టమైనవి. అనేక అనర్థము లకు అదేకారణమైనది. సారస్వతము నిర్జీవమైనది జీవలోకమునకూ సారస్వ తమునకూ ఉండవలసిన సంబంధము ఏమీలేక కవులశ్రమ నిరర్థకమయినది. లోకులకు సారస్వతమూ జ్ఞానమూ అందరాని పండ్లయినవి, పండితుల కృత కభాష అలవాటుచేసుకొన్నవాళ్ళు పండితుల భేషజాలు అలవలంబిస్తున్నారు, శబ్దార్థము అప్రధానమైనది. వట్టి శబ్దాలు వల్లించడమే విద్యాభ్యాసమయినది.

నేను—తెలిసిందా ? ఇప్పుడు రవీంద్రనాథఠాకూరుగారు వ్యావహారికవా భాషలోనే కావ్యాలు రచిస్తూ ఉన్నారు ! ఇంకా అనేకులు బంగాళీవారు వాడుక మాటలతోనే కొత్తకొత్తకావ్యాలు ఇంపుగా రచిస్తున్నారట :- అందుచేతనే అంతకంతకు వారి సాహిత్యము పండితపామర సామాన్యమైన లౌకికభాషలో విజృంభిస్తున్నది. నేటిస్థితి సునీతికుమారఛాటర్జీగారు వివరించివున్నారు.చదువు తాను వినండి—ఇదిగో పుస్తకము! నాయుడుగారూ మీరేచదివి, ఈవాక్యా నికి అర్థం అచార్లుగారికి చెప్పండి—

"The present day litera y Bengali is often nothing but Calcutta colloquial, with only a few archaic inflections of the verb; it is freely used in literature, especially in poetry, drama and fiction; and there is a strong body of writers who advocate the supersession of the old literary language by this living and vigorous form of spoken Bengali." Dr, Suniti Kumarchatterji: Bengali Phonetics, 1921.

శాబాష్! అచార్లుగారూ! బ్రతుకుతెరవెరిగిన వాళ్లండీ బంగాళీవాళ్లు! సాధ్యాసాధ్యములు సాధకబాధకములు చక్కగా ఆలోచించి కార్యసిద్ధికి అను కూలమయినసాధనము చేతబట్టి ఇష్టార్థముసాధిస్తారు; ప్రతికూలమయిన సాధ

నము విడచిపెట్టడానికి జంకరు. భాష సాధనముగాని సాధించవలసిన పరమార్థముకాదని వారు తెలుసుకొన్నారు. అందరికి సుపరిచితమయిన వాడుకభాష సాధనముగాజేసి సారస్వతము నిర్మించి ప్రజలలో విజ్ఞానము వెదచల్లుతున్నారు. ఇప్పుడట, కలకత్తాలో శిష్టజనవ్యవహారమందున్న భాషే గ్రాంథికభాషగా గ్రంథాలన్నిటిలోనూ, అందులో ముఖ్యముగా పద్యకావ్యములలోను, నాటకములలోను, నవలలలోను, స్వేచ్ఛగా వాడుతున్నారట. ఏవో పాతక్రియారూపములు కొన్నిమాత్రము ఉంచుకొన్నారట. నిస్తేజము నిర్వీర్యము అయిన ప్రాచీనగ్రాంథికభాష పరిత్యజించి, అవికలమయిన అర్థపుష్టి, శబ్దశక్తిగలిగి జీవకళతో కలకలలాడుతూ ఉన్న నేటి వాడుకభాషే కావ్యరచనకు ఉచితమైన భాషగా అంగీకరించదగినదని విద్వత్కవులనేకులు పట్టుదలతో వాదిస్తున్నారట! నూరేండ్లక్రిందట మన తెలుగువారికంటె బంగాళీలు ఈవిషయంలో చాలా వెనుకబడి ఉండేవారట. ఇప్పుడు మనమే చాలా వెనుకబడి ఉన్నాము. మనలో జ్ఞానసంపన్నులు లేకకాదు. అయితే, విషయము తెలిసినవారికి ఆంధ్రపండితుల కృతకభాషరాదు. ఆకృతకభాష అభ్యసించినవారికి విషయము తెలియదు. కృతకభాషలో రచించిన గ్రంథాలేకాని వ్యావహారికభాషలో రచించినవి బడులలో చదవకూడదని పరిషత్తువారు పట్టుపట్టి ప్రభుత్వమువారిచేత శాసనము చేయించినారు. విద్యావంతులు ముందుగా వాడుకభాషలో గ్రంథము రచించి తర్వాత భాషాపండితులచేత దిద్దించి ప్రకటించవలెనట. అవే బడిపిల్లలు చదువవలెనట! ఆంధ్రవిశ్వవిద్యాలయములలో విజ్ఞానవిషయములు సవిస్తరముగా నోటనే ఉపన్యసించి విద్యార్థులకు చెప్పవలెనే—

నేను—వీరేశలింగంపంతులుగారిని వేంకటరాయశాస్త్రులుగారు నిందించడం కూడా బడిపుస్తకములనుగురించే. రవీంద్రనాథఠాకూరుగారు ఏదిహానికరమని నిందించినారో అదే ఉత్తమమైనదని శాస్త్రులుగారున్ను పరిషత్తువారున్ను శ్లాఘిస్తున్నారు. గ్రాంథికభాషలోని శబ్దములు విడిచి వ్యావహారిక భాషలోని శబ్దములు ప్రయోగించి పంతులుగారు రచించిన పుస్తకాలు చిన్నబడులలో "బాలురపౌత్తములు" గాను కాలేజీలలో "శాస్త్రవిద్యార్థుల పౌత్తములు" గాను, విద్యాధికారులు నియమించి తెలుగు పిల్లలచేత చదివించి తెలుగువారి దేశభాష పాడుచేస్తున్నారని రెండుతరగతుల గ్రంథాలూ వేరేవేరే విమర్శించి శాస్త్రులుగారు తమ అధ్యక్షోపన్యాసము రెండు భాగములుగా విమర్శించినారు. నేనున్ను ఆవిభజనానుసారముగానే నావిమర్శనము రచించినాను. వారుచేసిన అపవాదములో ప్రతిఅంశమున్ను వారిమాటలతోనే ముందుగా ఉదాహరించి వెంబడినే విమర్శచేసి నా ప్రత్యుత్తరము ఇచ్చినాను. బుద్ధిపూర్వకముగా అసత్యము ఎక్కడా చెప్పలేదు. పక్షపాతము వహించలేదు. ప్రమాణముచూపకుండా

ప్రతిపక్షులవాదము ఖండించలేదు, బుద్ధిపూర్వకముగా చేసిన తప్పులు పెద్దలు క్షమింతురని నమ్మి ఈ వ్యాసము ప్రకటిస్తున్నాము. మీరు రేపు దయచేస్తే చదివి వినిపిస్తాను.

ఆచా—బాగా నేడుందిగాని, వెంకటరాయశాస్త్రిగారు గ్రామ్యభాష అంగీకరిస్తారని నమ్మలేము. వారివంటి వారిబోధవల్లనే వ్యామోహము నిలిచిఉన్నది.

నాయు—పోనీండి ! వారంగీకరించకుంటేమానిరి, భాష వారొక్కరి సొమ్ము కాదు, లోకులందరిదిన్ని ఇప్పుడు వాడుకభాషలో పుస్తకాలూ, పత్రికలూ చాలా ప్రకటిస్తూనే ఉన్నారు. సభలలో అందరూ, అధ్యక్షులుకూడా వ్యావహారిక భాషలోనే ఉపన్యసిస్తున్నారు; యథోక్తముగానే పత్రికలలో ఆ ఉపన్యాసాలు ప్రకటిస్తున్నారు. తీర్మానములన్నీ వాడుకభాషలోనే వ్రాస్తున్నారు. యూనియన్ పంచాయితీలు తాలూకా బోర్డులు, జిల్లాబోర్డులు మ్యూనిసిపల్ బోర్డులు మొదలయిన సంఘముల వ్యవహారము నోటనూ, కాగితము మీదనూకూడా వాడుకభాషలోనే జరుగుతున్నది. రేపు ఆంధ్రరాష్ట్రము ఏర్పడ్డతర్వాత ప్రభుత్వ సభలోను శాసనసభలోను రాజ్య వ్యవహారము వాడుక మాటలతోనే జరుగక తప్పదు. అప్పుడు గ్రాంథికాంధ్రములో పండితులు తమ బడాయి ప్రకటిస్తే రామమూర్తి పంతులుగారివంటివారు వారి అపశబ్దాలు బట్టబయలుగా వారి భాష విమర్శించి వెల్లడి చేస్తారు. బలాత్కారముగా నయినా ప్రజలందరికీ చదువు వచ్చేటట్టు చేస్తేనే కాని స్వరాజ్య వ్యవహారము సాగదు. ప్రజలందరూ గ్రాంథికాంధ్ర భాషాపండితులు కాలేరు, వాడుకభాష వారికి నేర్పితే చాలును. వాడుకభాషలోనే అన్నివిషయములనుగురించి కావలసినంత జ్ఞానము సంపాదింపవచ్చును. పంతులుగారు చేసే హితోపదేశము నేడుకాకపోతే, రేపయినా గ్రాహ్యమవుతుంది గాని కాకపోదు. బంగాళారాష్ట్రములో అయిందికాదా ?

నేను—కానీండి; కాకపోనీండి. నాకు కర్తవ్యమని తోచినపని నేను చేస్తున్నాను. అది లోకమునకు హితమయినదనే నమ్ముతున్నాను. అన్ని దేశములలోను సదాచారముగనున్నదే నే నుపదేశిస్తున్నాను. మన తాతలనాటివరకున్ను మనదేశమందుకూడా బహుకాలము మన పూర్వులు అట్లే ఆచరించినారు. అందుకు నిదర్శనముగా లిఖితపుస్తక భాండాగారములందు వ్యావహారిక భాషలో రచించిన గ్రంథములు నానా విషయములను గురించి పండితులు వ్రాసినవే వేలకొలదిగా ఉన్నవి.

నా, ఆచా—రేపు రెండోపూట వస్తాము, వ్యాసముచదివివినిపింతురుగాని నమస్కారములు, సెలవు.

నేను—చిత్తం. నమస్కారములు.

ప్రస్తావనలో చెప్పినచొప్పున కీర్తిశేషులయిన కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములనుగురించి శ్రీవేదము వేంకటరాయశాస్త్రిలవారు కావించిన దూషణము వారి ఉపన్యాసమందు రెండుభాగములుగావిభక్తమై ఉన్నది మొదటి భాగము "బాలురపొత్తము"లను గురించినది. రెండోభాగము "శాస్త్రవిద్యార్థుల తెనుఁగు పొత్తములను (College Telugu)" గురించినది. మొదటిభాగము ఆరుఖండములుగా విడదీసి, ఒక్కొక్క ఖండము శాస్త్రిలవారు ప్రకటించినట్లే వారి సొంతమాటలే ఉదాహరించి, దానిలోని అంశములన్నిటిని వరుసగా ఎత్తుకొని, విమర్శించి నేనీ వ్యాసమందు ముందుగా ఉపన్యసిస్తున్నాను. రెండో భాగములో శాస్త్రిలవారు తప్పులని దూషించిన శబ్దములు వరుసగా ఒకొక్కటి పేర్కొని దాని సాధుత్వాసాధుత్వము యథాశక్తి నిరూపిస్తాను. శాస్త్రిలవారి ఉపన్యాసములోని విషయానుక్రమణమునే నేనున్ను అనుసరించినందున, దానిలోని పునరుక్తి నావిమర్శమందున్ను కొంతమట్టుకు అనివార్యమైనది.

(ఈవ్యాసమందు నేనుదహరించిన గ్రంథములలో శబ్దరత్నాకరమందు పేర్కొని వాటికి సంకేతములు తరచుగా వాడి ఉన్నాను. అవి ఏవంటే, వేదం వేంకటరాయశాస్త్రిలవారు రచించినవి: క. సా. = కథాసరిత్సాగరము; ప్రతా=ప్రతాప రుద్రీయము; ఉష; అలం=అలంకార సంగ్రహము. శి. వ్యా =శిశువ్యాకరణము. వ్రత.=వ్రతకల్పములు, అముద్రి=అముద్రిత గ్రంథచింతామణి: ఆం. చ.=ఆంధ్రులచరిత్రము, వి. స =విజ్ఞానసర్వస్వము. ఆం. సా.=ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. ఆంధ్ర=ఆంధ్రపత్రిక. ఆం. భా.=ఆంధ్రభాషార్ణవము. శ. ర.=శబ్దరత్నాకరము. ల. నా.=లక్ష్మీనారాయణీయము. బ్రౌ. ని.=బ్రౌణ్యనిఘంటువు.)

## మొదటిభాగము— బాలురపొత్తములు

దూషణవాక్యము:—ఆవిషయముల నించుక (ఇంచుకయే) ఉద్ఘాటించెద —

"ననవిల్తుశాస్త్రంపుమినుకులావర్తించు పని వెన్నతోడఁ బెట్టినది మాకు" అని పెద్దన్నగారు చేసిన యుపదేశమును దృఢముగా నవలంబించి ప్రథమ శిక్షపుస్తకములోనే రాజకీయ విద్యాంగమువా రీక్రింది ప్రయోగములను జేయించియున్నారు:

1 జలగ. 2 దవడ, 3 జండా. 4 కాలవ, 5 మనమడు —అనిమాటలు నేర్పినారు. జెలగ, దవుడ, జెండా, కాలువ, మనుమఁడు, అని వీనిపలెనే యుచ్చరించుటకు సులువగు సాధురూపములుండగా నీయసాధురూపములనే నేర్పుట యవిమృశ్యకారితగదా?"

2 విమర్శము. తెలుగుశబ్దముల రూపములలో ఏవిసాధువో ఏవిఅసాధువో నిశ్చయించుటకు ప్రమాణమేమిటి? 'సిద్ధిర్లోకాత్,' 'శబ్దసిద్ధిలోకంబువలనం దెలియును' అని అన్ని దేశములందున్న పండితులు అంగీకరించినారు. ఏసంఘమందైనా శిష్టజనసామాన్యమైనభాష ఉత్తమమైనదిగాను సాధువైనదిగాను అందరున్ను ఎన్నుకొంటున్నారు. శిష్టజనుల పిల్లలకు అభాషే అలవడుతుంది ఆభాషద్వారానే పిల్లలందరున్ను జ్ఞానము సంపాదిస్తారు. శిష్టవ్యవహారమునకు వ్యతిరిక్తమైనభాష వాడేవారుకూడా శిష్టులతో సహవాసము చేయడమువల్ల శిష్టులభాష అలవర్చుకొంటాడు. బడులలోను సభలలోను శిష్టుల వ్యావహారికభాష నిరంతరంగా వినబడుతూ ఉంటుంది గనుక పిల్లలకూ పెద్దలకూ సామాన్యమై, ఆభాష దేశభాషగా వ్యాపిస్తుంది. నేడు లోకవ్యవహారమందు రూఢమయిఉన్నశబ్దము అసాధువని ఎవ్వరికిన్నీ తోచదు. పూర్వకాలమందు ఆశబ్దము మరి ఒకరూపముతో ఉంటే, ఉండుగాక. అప్పటివ్యవహారము అప్పుడు సాధువైనట్టే ఇప్పటివ్యవహారము ఇప్పుడు సాధువు. ప్రజలకు స్వస్థాన వేషభాషాభిమానము శిష్టజనుల వేషభాషలనుపట్టే కలుగుతుంది. వారిని బుద్ధిపూర్వకముగానో, అబుద్ధిపూర్వకముగానో అనుకరించుటవల్లనే ఆవేషభాషలు అందరికీ అలవాటయి, 'దేశవేషము' 'దేశభాష' అవుతవి. అట్లే ఆచారము, నడివడి, శీలము, గుణముమొదలైనవన్నీ ఒంటికి ఎక్కి, లెస్సగా పట్టి ఉండేవి ; కాని ఎప్పుడో ఒకప్పుడు ఎరువుగా తెచ్చిపెట్టుకొనేవికావు.

అయితే వేంకటరాయశాస్త్రులవారికి నేటివ్యావహారికభాష శిష్టులదైనా సాధువుకాదు ఈయన 1886వ సంవత్సరమున రచించి ప్రకటీకరించిన శిశువ్యాకరణమందు మొదటిసూత్రములో 'పెద్దలు ఎట్టిమాటలకు గ్రంథములయందు ఎట్టిరూపములనువాడిరో, ఆ విషయమును దెలుపునది వ్యాకరణము' అని వ్యాకరణశాస్త్రలక్షణము చెప్పినారు. కాని 'పెద్దలు' అనగాఎవరో, 'గ్రంథములు' అనగా ఏవోస్పష్టముగా చెప్పినారుకారు. జ్యోతిశ్శాస్త్రం వైద్యశాస్త్రము మొదలయినవిద్యలు తెలుగున వివరించినవారు, ప్రబంధములకు టీకలు వ్రాసినవారు, రామకీర్తనలు రచించినవారు పెద్దలుకారా ? వారురచించినవి గ్రంథములు కావా ? అవి వ్యావహారికభాషలోనే ఉన్నవి మనతాతముత్తాతలనాడు బాలుర పొత్తములు రచించిన రావిపాటి గురుమూర్తిశాస్త్రులుగారు, ఉదయగిరి శేషయ్యగారు పెద్దలుకారా ? వారి పుస్తకములు దుష్టగ్రంథములా? గురుమూర్తి శాస్త్రిగారి పంచతంత్రము 1834వ సంవత్సరము మొదలుకొని 40 ॥లు బడిపిల్లల చేత ఉపాధ్యాయులు చదివించేవారు. చిన్నయసూరిగారి నీతిచంద్రిక ఆదర్శమై నెలకొన్నపిమ్మట అగ్రంథములోని భాష ఆదరణీయమై అంతకంతకు వ్యావహారికభాషయెడల విద్వేషము పుట్టించినది.అయితే సూరిగారుగాని, వారి శిష్యులుగాని

నేటివరకున్ను "పెద్దల గ్రంథములందు తెలుగుభాషలోని మాటల కన్నిటికిన్ని యెట్టి రూపములు వాడిరో" తెలిసేటట్టు అనుశాసనము నిరవశేషముగా చేయలేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు బృహదాంధ్ర నిఘంటు నిర్మాణమే పూనుకొన్నా రట, గాని బృహదాంధ్ర వ్యాకరణ నిర్మాణము ఇప్పటికిన్ని తలపెట్టనేలేదట.

ఇప్పుడు మన తెలుగుదేశమందున్న రెండుకోట్లమంది తెలుగువారున్ను వాడుకలోనున్న తెలుగుమాట లన్నిటిలోను వేటి రూపములు "పెద్దలు" "గ్రంథములలో" వాడినచొప్పున ఉన్నవో, వేటి రూపములు ఆ చొప్పున లేవో తెలుసుకొని సాధుత్వాసాధుత్వము నిశ్చయించుకొని ఆ సాధువులు పరిత్యజించి సాధువులు అలవర్చుకోవలసి ఉన్నదట! ఇట్టి దేశభాషాసంశోధనము సాధ్యమో అసాధ్యమో వివేకులు ఆలోచింతురుగాక. శాస్త్రిలవారి ప్రమాణము చొప్పుననే నాకు వల్లనయి నంతమట్టుకు వారు కావించిన దూషణము యుక్తమో కాదో విచారిస్తాను.

(1) 'జలగ' తప్పనుటకు కారణము కనబడదు, ఇది సం: "జలౌ (లూ) కా" నుండి వచ్చినది. మొట్టమొదట 'జలుగ' గా వుండెనేమో? 'జ' కారము తప్పట! ఏమి? 'జటా' నుండి 'జడ' రాలేదా? 'చంద్ర' శబ్దము నుండి చందురుడు రాలేదా? పెద్దలలో పెద్ద పెద్ద తిక్కన, భారతము, శాంతి పర్వము (ఆ. 2, 393) లో 'జ' కారయుక్తముగానే 'జలగ' వాడినాడు. ఆ జకారము యతిస్థానమందున్నది. చూడండి:—'క'. జలగదిగిచినట్టు గొనఁగ జను నిల సొమ్ముల్, శ-ర-లో ఈ శబ్దమున్ను ఈ ప్రయోగమున్ను ఉన్నవి. శాస్త్రిలవారు సాధువని చెప్పిన 'జెలగ' శ-ర-లో లేదు. బ్రౌ. ని లో ఉన్నది. అయితే ఆ నిఘంటువునిండా "గ్రామ్యభాషే" గదా. శాస్త్రిలవారికి అది ప్రమాణమవుతుందా? అయితే నాకు సంతోషమే. ఇకను శాస్త్రిలవారి నిదానము చొప్పున బలుపునాడిగల గ్రంథములందుగూడా 'జలగ' ఉన్నది. వి. స. లో (చూ. విన్నపము పుట 10) 'జలగలు' ఆంధ్రపత్రిక (4-1-23) లో సర్ త్యాగరాయ శ్రేష్ఠిగారి ఉపన్యాసమందు "మంత్రు లీయుద్యోగమును జలగలు పట్టుకొనినట్లు" అని ఉన్నది. ఇప్పటి కవులలో మిక్కిలి ప్రఖ్యాతిపొందిన తిరుపతి వేంకటేశ్వరులు తమ దేవీ భాగవతమందు (1-367) "చ. జలగ శరీరముం బొదివి చయ్యన నెత్తురు క్రోలుభంగి" అని తిక్కన వలెనే 'జలగ' ప్రయోగించినారు.

(2) 'జండా':—తప్పట! శ-ర-లో 'జండా' 'జెండా' రెండున్నూ ఉన్నవి. ఇది హిందీ 'ఝండా' నుండి తెలుగులోనికి వచ్చినది. సం. 'జయ' తెలుగు 'జే' అనిన్ని 'జా' అనిన్ని రెండు రూపములతో ఉన్నది. రెండున్ని పెద్దలు వాడినారు, శ-రలో 'జా' లేదు. లేకుంటే ఆ లోపము నిఘంటువు

దోషముగాని శబ్దముయొక్క దోషముకాదు. వరాహపురా. (1-148) లో నంది మల్లన 'జా పరమేశ్వరా యనిన-జంతువులన్నియు' అని యతిస్థానమందు 'జా' ఉంచి వాడినాడు.

(3) 'కాలవ'—శ. ర. లో లేదు గాని బ్రౌ. ని. లో ఉన్నది. ల. నా. లో కూడాను, బలుపునాడిగల వి. స. లో. 1332 వ పుటలో కనబడు తున్నది. రంగయ్యసెట్టిగారు తెలుగు పీనల్ కోడ్ 432 వ సెక్షనులో వాడినారు. మరాటీ భాషలోకూడా 'కాలవా' అని అంటారట! నేను కాలువ అనేవాడుతున్నాను గాని 'కాలవ' తప్పనలేను. లోకమందున్నది.

(4) 'దవడ'—తప్పనుటకు ప్రమాణ మేమిటి? 'దవుడ' : 'దౌడ' అని. శ. ర. లో ఉన్నదిగాని, దవడలేదు. అది నిఘంటువుదోషము. 'అవల' అవుల 'ఔల' చేర్చినవారు 'దవడ, దవుడ, దౌడ' కూడా చేర్చుకోవలసిఉండెను. ఆం. భా. (11, 143) లోను ద్విరూపకోశములోను ల, నా, లోను 'దవడ' ఉన్నది. విక్రమాంకదేవ చరిత్రమందు తిరుపతి వెంకటేశ్వరకవులు వాడినారు (చూ. పు. 46). సులభవ్యాకరణమందు వావిలికొలను సుబ్బారావుగారు తాలువులు-దవడలుపీనియందుఁబుట్టిన యక్షములు(?) తాలవ్యములు అని అనుశాసించినారు. బలువునాడిగల వి. స. (పు703) లోను; చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి 'వినోదముల' లోను (పు18) అనేక గ్రంథములలోను పెద్దలు వాడిఉన్నారు. 'దవడ' సం. దంష్ట్రా - ప్రా-దాఢా-నుండివచ్చినది. అయితే సంస్కృతశబ్దముతెలుగు దౌంష్ట్రా అనిగాని దౌఁష్ట్రాఅనిగాని సాధారణ ముగా ఉచ్చరిస్తారు. మాటకు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు క్రొత్తగా రచించిన రామాయణసంగ్రహమందు (చూ. కిష్కి.22) దౌష్ట్రలుజూచి అని కనబడుతున్నది. ఇట్టిఉచ్చారణకారణముగా దవుడఅనే రూపము రావచ్చును. మడికిసింగన వాసిష్ఠ రామాయణమందు, జ్ఞా - ప్రాసముగా, 'సౌజ్ఞాఖ్యానములు' అని కందపద్యములో ప్రయోగించినాడు. సంజ్ఞాసరిగా తెలుగువారు నేడు ఉచ్చరించరు. ఓంఢ్రులు యథావిధిగా పలుకుతారు. అట్టివుచ్చారణనుండి సన్న అనేరూపమున్ను సైంగ్యఅనే ఉచ్చారణము నుండి 'సైఁగ' అనేరూపమున్ను తెలుగుగ్రంథములలోనికి వచ్చినవి. నేడు 'సౌఁగ్య, సవుగ్య' అనేవి కనబడుతున్నవి నేటి లౌకికభాష నేడు సాధువనే వారు నేటిశబ్దరూపములు వాడుతారు. పాతరూపములే కావలెననేవారు వెదకి తెలుసుకోవలెను. మనశాస్త్రులవారు వి. సా. లో 'ఆవలించు' వాడినారే (చూ. పు. 213. 398). ఇది 'దవడ' వంటిదేకదా. అయితే, ఇది శ. ర. లో లేదు. లేకుంటేనేమి? ల. నా. లోనున్ను, ఆం. భా, లోనున్ను ఉన్నది; లోకములో

ఉన్నది; ఆంధ్ర వాల్మీకి రామాయణమందున్నది (బాల. 479). ప్రాచీనులయిన పెద్దలు గ్రంథములందు 'అవులించు' అనే వాడినారు. ఈ కాలపు పెద్దలు 'ఆవలించు' అనివాడుతూ ఉన్నారు. మనశాస్త్రిలవారు వాడినశబ్దము నేటి వాడుకనుబట్టి సాధువు, పూర్వుల వాడికనుబట్టి అసాధువు.

(5) 'మనమడు'—అసాధువట! ఎందుచేతనో! 'మనమడు' 'మనమరాలు' అని నేడు లోకమందుఅందరూ అంటున్నారు శ. ర. లోలేకున్నా ల. నా. లోనున్నది. నవలలలోను, నాటకాలలోను కనబడుతున్నవి. అయితే ఇవి పెద్దలగ్రంధాలు కావంటారుశాస్త్రిలవారు, వసుచరిత్ర పెద్దలగ్రంథాలలో చాలాచాలా పెద్దదిగదా: అందులో (ఆV 35) "ధవ్యగుణమంజి మనమరాలి మానసమున మనమరాలి మనమరాలి వివాహసంభ్రమముఁజూడ" అని, రామరాజభూషణుడు 'మనమరాలు' శబ్దము చిత్రరచనములో చమత్కారముగా పొందుపర్చినాడు. "సద్వ్యవహారగతములగుటంజేసి యగ్రామ్యములును ప్రయోగార్హములును ననుతలంపున రామరాజభూషణుఁడు ప్రయోగించియుండు నని తోఁచుచున్నది" అని దీనిని గురించిన్ని, ఇట్టివే మరికొన్నిటిని గురించిన్నీ, బ్ర. శ్రీ. వఝల చినసీతారామస్వామిశాస్త్రిలవారు తమవసుచరిత్ర విమర్శన మందు వ్రాసినారు. పుదూరి సీతారామశాస్త్రిగారు 1834 సం॥లో రచించిన ప్రశ్నోత్తరవ్యాకరణమందు ఏకాది శబ్దములలో 'మనమడు' అనేరూపముగల శబ్దము పేర్కొన్నారు, (అజంతప్రకరణము, 49వ ప్రశ్న) కృష్ణజన్మఖండ మందు శ్రీగోపీనాథ వేంకటకవీంద్రులు "ధాతకు, న్మనమఁడవౌట" అని వ్రాసినారు. (అ, 4. పు. 212) వేంకటరాయశాస్త్రిలవారి నిదానమునుబట్టి ఆం. చ. లో "బలుపునాడి" ఆడుతున్నదట కనుక, ఆగ్రంథమందే (1, 86. 142, 194, 271) నాలుగుపుటలలో నాలుగుచోట్ల. 'మనమఁడు' బలిసిచన్నదని తెలుసుకొని పండితభిషక్కులు ఇట్టిరూపములు భాషాదేవికి రోగలక్షణములని తలంచకుందురుగాక. ఇవి గ్రంథములలో వాడుట 'అవిమృశ్యకారిత' అని శాస్త్రిలవారు అన్నారు: కాని, సాధువయిన శబ్దములను అసాధువులని దూషించడమే అట్టిదనవలెను. తిక్కనవంటి కవీశ్వరుడు భారతమువంటి గ్రంథములో యతిస్థలమందు జడుంచి, జలగశబ్దము ప్రయోగించి ఉండగా, 'బాలురపొత్తములలో అశబ్దమువాడితే రాజకీయ విద్యాంగమువారు సరస్వతికి విషప్రయోగము చేయించినారని దూషించేవారు. ఎట్టి విమర్శకులో పక్షపాతము లేకుండా ఆలోచించగలవారు చెప్పగలరు.

"జొన్నకంకెకు నూఁగు ఉండునా?"—"కంకె" యేమి? "కంకి" యని లోపము. ఈ పుస్తకములోనే-కంకులను కోయును-అని యికారాంత శబ్దముగాను ప్రయోగమున్నది. "పెంకుడుఇల్లు" ఇందు "డు" ఏమి? పెంకు

టిల్లు అనరాదా? "శనగలు"—"సెనగలు" సాధురూపము. పామరులు "శెనిగలు" అందురు. పామరతరులు "శెనిగెలు" అని ఎత్వాంతము చేయుదురు. శెనిగెలన్నందులకు నా గుమాస్తాను బ్రహ్మణునొకనిని నేను తఱిమవైచితిని. "ఊసరవిల్లి" యట—వెల్లిగాని విల్లిగాదు. ఒక్క "గలుచు"ధాతువునకు వచ్చిన పాట్లు కనుఁడు:—ఎవరుగెలిచెదరో (గలుచు ప్రకృతి) "నేనుగెలవలేనా" (గెలచు ప్రకృతి), "పందెము (?) గలచెను" (గలచుప్రకృతి), "గెలుపుకలుగును" (గెలుచు ప్రకృతి)—అన్నిటను గెలుచేప్రకృతిగానుండరాదా?

విమర్శనము:—(1) 'కంకి' 'కంకె' 'కంకులు' 'కంకెలు' లోకములో ఉన్నవి. అట్లే ఏ. వ. 'పల్లి' 'పల్లె' ఉన్నవిగాని, పల్లెలుమాత్రమే బ. వ. వాడుకలో కనబడుచున్నవి. 'పల్లులు' లేదు 'ఐతే' పల్లితప్పా? 'చెఱకుంబల్లి' అని ప్రాచీన తామ్రశాసనమందున్నది. సంపఁగె. సంపెఁగ, గరిటె, గరిట, గగ్గెర, గగ్గిర. పీకె, పీక, ఊఁకె, ఊఁక, తొట్టె, తొట్టి. తొట్టెల, తొట్టిల, గెంటెము, గింటెము, చిత్తకార్తె చిత్తకార్తి, కోరికె, కోరిక కోరికి, పోలికె, పోలికి, ఒకతె, ఒకత, ఒకతి. ఇటువంటివి భాషలో వందలకొలదిగా ఉన్నవి. ఎవరికి ఏది అలవాటయితే అది వాడుతారు. కవులు తమ కుచితమని తోచినట్లు వ్రాసినారు, వ్రాస్తున్నారు. వేంకటరాయ శాస్త్రిల వారు హితోపదేశములో నెమలి (71) అనిన్ని, క. సా. లో. వదినె (పు.170) చెడిపె (పు. 414) అనిన్ని వ్రాసినారు. శ. ర. లో. నెమలి. చేర్చలేదు; 'నమిలి' 'నెమిలి' సాధువులని ఉన్నది; 'వదిన' లేదు 'వదినె' మాత్రమే ఉన్నది. అయితే, 'వదిన' తప్పా? ల. నా. లో ఉన్నది. శ. ర. లో: 'చెడిపె' లేదు. 'చెడిప' మాత్రమే యున్నది. అందుకు ప్రమాణముగా కాశీఖండము (ఆ. 2. ప. 72)"లోని చెడిపతోఁ జాలపోరామి సేయజనదు" అని యుదాహృతమయి ఉన్నది. ల. నా. లో. ఈ ప్రమాణమే చూపించి 'చెడిప' శబ్దమున్నూ దానితోపాటు 'చెడిపె' రూపాంతరమున్నూ చేర్చుకొన్నారు. అయితే, వావిళ్ళవారు ముద్రించిన కాశీఖండములో 'చెడిపె' అని ఉన్నది; కాని, శ ర. లో. ఉదాహరించినట్లు 'చెడిప' అని లేదు. నావద్దనున్న తాటాకు పుస్తకములో "చెడిపితోడను బోరామిసేయవలదు." అని ఇకారాంత రూపమున్నది. ఇట్లు "చెడిప, చెడిపి, చెడిపె" అని మూడు రూపములు కంటికి కనబడుచున్నవి. వాటిలో ఏది సాధువు? సాధుత్వా సాధుత్వము నిరూపించుటకు ప్రమాణమేమిటి? శ. ర. లో. 'సంపెఁగె, సంపఁగ' మాత్రమే యెత్తుకొన్నారు. ప్రభావతీ ప్రద్యుమ్నములో యతిస్థానమందు 'ప' గలిగి 'సంపంగి' అని ఉన్నది. (చూ. 11, 78) వేంకటరాయ శాస్త్రిలుగారు 'కొమారిత' అని 762-వ పుటలోను 'కొమారితె' అని 768 పుటలోను క. సా లో వ్రాసినారు

ఇవి వారి, 'వ్రతకల్పముల'లో కూడా ఉన్నవి. శ-ర-లో మొదటిదేకాని రెండ వరూపములేదు. ల. నా. లో రెండున్ను ఉన్నవి. చాలాచోట్ల వ్రతకల్పముల లోను (చూ. 63.) తక్కిన గ్రంథములలోను శాస్త్రిలుగారు ప్రయోగించిన 'గాడిదె' శ-ర-మే ప్రమాణమయితే తప్పవుతుంది. ల. నా. ప్రమాణముగా అంగీకరిస్తే సాధువు. ఆకోశకారులు ఎందుకు చేర్చినారు ? లోకములో ఉన్నది కనుకనే. చిన్నయసూరి నీతిచంద్రిక మొదటికూర్పులలో 'గాడిదె' చాలచోట్ల ఉన్నది. గాని ఈ రూపము శ-ర-లో లేనందున నేటి కూర్పులలో 'గాడిద' అని పరిష్కర్తలు దిద్దివేసినారు. ఇప్పటి నీతి చంద్రిక చిన్నయసూరి రచించి నట్లులేదు. క-సా-లో 'సంకిలి' (పు. 211) 'సంకిళ్ళు' (44-83) తరుచుగాను 'సంకెలలు' (62) అరుదుగాను రెండురూపములు కనపడుతున్నవి. మొదటిది ఏకోశమందున్ను నాకు కనబడలేదు. 'సంకెల' 'సంకలియ' శ-ర-లోను ల-నా-లోను ఉన్నవి. లోకములో 'సంకిళ్లు' 'సంకెళ్లు' బహువచనమందు వాడుతున్నారు. ఏ. వ. రూపము నేను. వినలేదు. బ్రౌ. ని. లో 'సంకెల' ఏ. వ., 'సంకిళ్ళు' బ. వ, అని ఉన్నది. కనుక 'సంకిలి' శబ్దము 'సంకిళ్ళు' అనే బ. వ. రూపమునుండి శాస్త్రిలుగారు సాధించినదిగా కనబడుతున్నది. ఇదే కృతకభాష; అనగా వాస్తవమయిన వర్తమానవ్యావహారిక భాషా కాదు వాస్తవమయిన ప్రాచీనకావ్య భాషా కాదు. నాగపూడి కుప్పుసామయ్యగారి గ్రాంధికాంధ్రముకూడా ఇట్టిదే, వారి భారతసారమందు 'సంకిలెలు' అని ఉన్నది. ఇట్టి అపశబ్దములు వాడుట నిజముగా విషప్రయోగమవుతుంది. వాడుకలో ఉన్నవి లౌకికములు. "లోకేవిదితా లౌకికాః"

లోకములో ఉన్నశబ్దమును కోశములోగాని వ్యాకరణములోగాని చేర్చుకోకపోతే కోశమున్ను వ్యాకరణమున్ను తప్పులవుతవిగాని శబ్దము తప్పుకాదు. పరమప్రమాణముగా గ్రహించదగిన కోశముగాని, వ్యాకరణముగాని తెలుగు భాషకు ఇప్పటికింకా ఒకటీ పుట్టలేదని అందరున్ను ఎరుగుదురు. ఉన్నమట్టుకైనా అవి పెద్దపెద్ద పండితులకే ఉపచరించడములేదు. సామాన్యులు కోశములు, వ్యాకరణములు ఎన్ని వున్నవో అన్నిన్ని దగ్గరపెట్టుకొని ఒక శబ్దము సాధువో కాదో అన్నిటిలోనున్ను వెదికి చూచి తెలుసుకొని మరీవ్రాస్తారా ? దేశభాష మాట్లాడినప్పుడుగాని వ్రాసినప్పుడుగాని దేశస్థులు ఇంతప్రయత్నము చేయవలసియుంటే లోకవ్యవహారము సాగుతుందా ? ఎంతో గొప్ప పాండిత్యముగలవారని ప్రఖ్యాతిపొందిన వేంకటరాయశాస్త్రిగారికి 'జలగ' శబ్దము సాధువని తెలియలేదు సరిగదా మరిఒకరు ఆశబ్దము ప్రయోగించునప్పుడు ఆలోచించకుండా అది అసాధువని నిందించుటకు సాహసించినారుగాని శ. ర. మైనా చూచినారుకారే ! అదిచూచివుంటే, తిక్కనప్రయోగమున్నదని తెలుసు

కొని ఉందురుగదా! నిష్కారణముగా ఒకరిని నిందించినారన్న నిందకు పాత్రులు కాకపోదురుగదా! తమ అలంకారసంగ్రహమునందు శాస్త్రిల వారు "క. ఆరయ నద్భుత మిధ్యా. శూరత్వోదార్యరచన,చొఱునత్యుక్తిన్" అని 63 వ పుట లో అత్యుక్తికి లక్షణము వ్రాసినారు. శ. ర. లో 'చొచ్చు' ధాతువున్నది; గాని 'చొఱు' లేదు (చొరు అయినాలేదు). చిన్నయసూరి బాల వ్యాకరణ సూత్రము వారి జ్ఞప్తియం దుంచుకోవలసి ఉండెను; లేకుంటే, గ్రంథమువ్రాసినప్పుడైనా చూడవలసి ఉండెను. ఇది వ్యావహారిక భాషలోని శబ్దము కాదు. గ్రాంథిక భాషలో 'చొచ్చు' ధాతువుకు ముత్తుపరంబగునపుడు మాత్రము 'చొరు' అగును. ఉ. చొరఁడు, చొరుము. పోనీ! గ్రంథములలో ప్రాచీన కవులు ఏలాగున వ్రాసినారో తెలుసుకొన్నారా? నే నెరిగినంతమట్టుకు ఏ గ్రంథములోనూ 'చొఱున్' అని కానీ, 'చొరున్' అని కానీ ప్రాచీనకవి ప్రయోగము ఒకటైనా కనబడలేదు రాజమహేంద్రవరము గవర్నమెంటు కళాశాలలో ఆంధ్రపండితులుగా ఉన్న, బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు 'శరణుచొచ్చుము' అని తాము నిరుడు రచించిన భాసనాటక కథ లలో (199 పుట) ప్రయోగించినారు. ఆంధ్రపండితులయినవారు బాలవ్యాకర ణము చదివినవారని అనుకోవలెనుగదా? చదివినఫలమేది? వ్యాకరణములో అనుశాసించిన మట్టుకైనా సాధువైన గ్రాంథికభాష పెద్దపేరుగల పండితులకే అలవడలేదు. భారతము తిరిగీ తెనుగున రచిస్తూఉన్న బ్ర. శ్రీ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు- కవిరాజబిరుదాంకితులు, ఆదిపర్వములో 'చొరి' అని (ఆ. 5. ప. 4,) చొరినన్ అని (ఆ. 10. ప. 251) 'చొఱితిని'అని (ఆ. 7. ప 72) అనేక పద్యములలో ప్రయోగించినారే! ఇవి కోశమునకున్ను వ్యాకర ణమునకున్ను ప్రాచీనకవిప్రయోగములకున్ను విరుద్ధముగా, నాకే కాక, అనేక పండితులకు కూడ కనబడుతున్నవి. ఏ శబ్దమయినా ఇప్పటి లోకవ్యవహారమునుగానీ పూర్వకవుల వ్యవహారమునుగానీ అనుసరించినట్ట యితే సాధువైన వర్తమాన వ్యావహారికభాష అనికాని సాధువైన ప్రాచీన కావ్యభాషఅనికాని అంగీకరించుటకు యోగ్యమవుతుంది. ప్రాచీన కావ్యభాష వ్యావహారికభాషకంటె వేరుగా ఉన్నంతమట్టుకు దాని లక్షణము ప్రాచీనకావ్య ములు లెస్సగా చదివి నేర్చుకొని అభ్యసించి అలవాటు చేసికొన్న వారికేకాని ఇతరులకు వాటిలో వ్యత్యాసము నిస్సందేహముగా బోధపడదు. మనము చదువుతూఉన్న ప్రాచీనాంధ్ర కావ్యములలోని పాఠములన్నీ నిర్దుష్టములుకావు. మనము చదువుకొన్న వ్యాకరణములు సంపూర్ణములుకావు. నిర్దుష్టములున్నుకావు. మనకున్న కోశములున్ను అట్టివే. చక్కగా రచించిన వ్యాకరణము, కోశము ఉన్నా వాటిసాయమున ప్రాచీనభాషలో మనము రచింప బూనుకొనుట అతి

సాహసము. నా అభిప్రాయము స్పష్టపర్చుటకు ఒక అంశము నిదర్శనముగా చూపిస్తాను. చనుదెంచు, అరుగుదెంచు, అగుదెంచు, పోవుదెంచు మొదలయిన క్రియలు అనేకము ప్రాచీనభాషలో ఉన్నవి. వీటిలో 'తెంచు' అనుబంధముగా ఉన్నది. వీటికి ముత్తుపరమైనప్పుడు 'తే' 'తేరు' లగునని (బాల. క్రి, 113) వ్యాకరణమందున్నది. చొచ్చు, పుచ్చు, తోఁచు, మొలచు, వగచు మొదలయిన చు కారాంత క్రియలకు 'తెంచు' అనుబంధముగా చేర్చినప్పుడు ఆ చువర్ణము లోపించుననికూడా వ్యాకరణమందున్నది. (బాల. క్రియ. 112). ఈ లక్షణము స్పష్టముగా ఉన్నా శ-ర-లో 'వగదెంచు' 'దే. ప్రే, వగదెగఁ జేయు, పరిష్కరించు అని అర్థముచెప్పి 'వగదెగు' దే. అ. క్రి. (వగ + తెగు) పరిష్కృతమగు అని కృతకశబ్దము కల్పించి చేర్చినారు. ఇది వాస్తవముగా వగచు + తెంచు=వగతెంచు. శ-ర-లో ఇచ్చిన ప్రయోగమందున్ను, ఇతర ప్రయోగములందున్ను శ-ర-లో చెప్పినఅర్థము పట్టదు. వ్యాకరణము రచించిన చిన్నయసూరిగారు నీతిచంద్రికలో 'పుచ్చు,' వాడవలసినచోట 'పుత్తెంచు' 'పుత్తెంచు' వాడవలసినచోట 'పుచ్చు' ప్రయోగించినారు. మన వేంకటరాయ శాస్త్రిలవారు శృంగారనైషధ వ్యాఖ్యానమందు (చూ. V 101) "వాగ్భామ.... ఒకమానవేంద్రు సమక్షమునకు నిందు బింబాస్యఁ దోతెంచి యిట్టులనియె" అని మూలమందు పాఠమిచ్చి టీకలో "తోతెంచి=తోడితెచ్చి" అని అర్థము చెప్పినారు నావద్దనున్న రెండు తాటాకు పుస్తకములలోనున్ను మూలమందు తెచ్చి వున్నదిగాని 'తెంచి' లేదు. ఈ అర్థమందు 'తోతెంచు' అనే రూపముండదు. అసంభవము. తోఁచు + తెంచు=తోఁతెంచు (కానవచ్చు; అభిముఖమై కనబడు). శ-ర-లో 'తోఁతెంచు' 'తోతెచ్చు' వేరువేరు శబ్దములుగానే యున్నవి. నైషధమందే VIII. 91 వ పద్యములో 'దినయౌవనంబు దోతెంచె' అనియున్నది. అక్కడ 'తోతెంచెను=కనబడినది' అని శాస్త్రిలవారు అర్థము వ్రాసినారు. బిందువు మాత్రము తీసివేసినారు. ఆగ్రంథమందే III. 12 లో ఏగుదెంచుచో=పోవు సమయమున అని తెంచు స్వార్థమందున్నట్లు అర్థముచెప్పినారు. కాని అక్కడ కథాసందర్భమునుబట్టి 'వచ్చు' అని అర్థమే పొసగివుంటుంది. 'పోవు' అనిచెప్పుట తప్పు. ఇంద్రుడు నారదుని అడుగుతున్నాడు—యుద్ధములో చచ్చిన రాజులు మాయింటికి (అనగా స్వర్గమునకు) అతిథులుగా రారేమీ ? అని. ఇట్టి సందర్భమందు 'పోరేమీ' అని అనగూడదుగదా ?

ఇట్లు ఈప్రాచీనాంధ్రశబ్దములు సరిగా తెలుసుకోలేక అకటావికటముగా అవి ప్రయోగించడమేగాక వాటి రూపములుమార్చి పాడుచేయడముకూడా జరుతున్నందుకు ఇప్పటివారి గ్రథములనుండి కొన్ని దృష్టాంతము లుదాహరిస్తాను. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిలవారి శ్రీకృష్ణభారతమందు "ఎమ్మె నను బాహు

బలాఢ్యునిఁ దాఁకు దెంచఁగన్" (సభా 11. 307) వావిలికొలను సుబ్బారావుగారి ఆంధ్రవాల్మీకి రామాయణము నందు "అంగదుఁ డంతటి యనదయే రిత్తయే తేరుటకు" (సుంద 1390). కూచి నరసింహం గారి గౌరాంగచరిత్రమందు "కృష్ణుని....ఏతెంచుమని వేఁడరాదు" (భా. II. ఆ. XI. 144). నందిరాజు చలపతిరావుగారి సావిత్రి (కథ)లో 'కళ్యాణము కల్యాణమని నారదుఁ డేతేరెను' (పు. 15) నడింపల్లి వేంకటహనుమంతరావు గారి సాహసికలో "రాగవల్లరి లీలావతిగృహమున కేతెంచగనే" (పుట. 66). నేతి వేంకటసుబ్బయ్యశాస్త్రిగారి ధర్మజ రాజసూయములో రెండుచోట్ల 'అరుగు దేరునిజకుమారునకు' (పు. 42 మొదటికూర్పు, 40 రెండోది) క్రతువుపక్ర మించునాఁటికి 'మీనాటికి మరల నరుగుదేరువాడ' (89. 84). నాగపూడి కుప్పసామయ్యగారి భారతసారమందు తెచ్చుధాతువిట్లే ప్రయుక్తమైనది. 'కల్లి దేరునెపంబున సైరంధ్రి నాయింటికిఁ బంపుము' (పు. 144) దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు కాంగ్రెసు సప్తాహమునందు "ఆంధ్రదేశమున కరుదెంచనున్న ధర్మజ్ఞులగు నాయకశిఖామణులకు అన్నముబెట్టి బిల్లు చేతి కీయవలసినదేనా?' (ఆంధ్రపత్రిక ది 6-12-23). ఆంధ్రపత్రికలో ఇవి లేఖకుల జాబులలోనే కాక, సంపాదకీయవ్యాసములందు సయితము, తరుచుగా ఇట్టిప్రయోగములు కన బడుతూ ఉన్నవి. (చూ. తే 20-11-22 సంచికలో) 'అరుగుదెంచక మానదు' అని రెండుచోట్ల, (తే. 4-1-23 లో) ఏతెంచగ అని, (తే 29-1-24 లో) 'స్వరాజ్యసిద్ధి నాటంకపరుచుట కేరికిని వీలులేని పరిస్థితులు త్వరలో నరు దెంచకమానవు' అని, ప్రజాస్వామిక పరిపాలనాభిలాషగల పత్రికాధిపతులు గ్రాంధికాంధ్రమురాని ప్రజలకోసము ప్రకటిస్తూఉన్న తమ పత్రికలో ప్రజలకు సుపరిచితమయిన భాషకుమారుగా కృతకభాష వాడడముచూస్తే గ్రాంథికాంధ్ర భాషావ్యామోహముయొక్క ప్రాబల్యమూ, ప్రభావము అప్రతిహతముగా ఉన్నట్లు కనబడుతున్నది. ప్రరూఢమూలమయిన దురభ్యాసము, దురాచారము పండితులయినా విడిచిపెట్టలేరుగదా! 'రాకమానదు' అనుటకు మారుగా 'అరుగు దెంచకమానదు' అనునది దురభ్యాసముకాక మరేమిటి? పామరులను మోస పుచ్చడముకాదా?

(2) 'పెంకుడుఇల్లు' తప్పన్నారు. విసంధి వివేకము రచించిన శాస్త్రుల వారు క. సా. లోని పడకయిల్లు (401.443) మొదటికూర్పులోనే 'పడుక టిల్లు'గా వ్రాయవలసిఉండెను. క. సా. లోని 'మూకుడునడుమ బొక్క'లో (478) తప్పుకాదా? మూకుటినడిమి బొక్క అనవద్దా? శ. ర. లో. 'లోవ' రెండవఅర్థము 'రథపీఠముమీఁది చట్టుపుఅంచు' అని విసంధిగా ఉన్నది

'పెంటపాడుఅవతల' 'కొండవీడుఅవతల' మొ॥ ఆంధ్రపత్రికలో కనబడ్డవి. వి. స. నిండా ఇట్టిప్రయోగము లున్నవే.

కృతకభాషలో విసంధివివేకమేకాదు. ఏవివేకమయినా కృతకమే. అది ఒక్కలాగున ఉండదు. 'ఎల్లవి' (భీష్మ. 1.65) 'ఎల్లయవి' (అను. IV 166) అని తిక్కనవాడినాడు. ఆ అర్థమందు నేడు లోకులు 'ప్రతీది' అంటున్నారు. ఆంధ్రపత్రికలోని జాబులలో కనబడుతున్నది. మనశాస్త్రిలవారు ఈరూపము గ్రామ్యమనికాబోలు 'ప్రతిది' అని (అలం. పు. 2) పద్యమందే ప్రయోగించినారు. ఎవరో జ్ఞప్తియందులేదు, 'ప్రతి యది' అని ఈమధ్యనే వ్రాసినారు!

(3) 'శనగలు' తప్పట! బ్రౌ. ని. లో ఉన్నదే. బలువునాడి గల వి. స. లో కూడా ఉన్నదే (పు. 345). "శనిగలు" అన్నందులకు నాగు మాస్తాను బ్రాహ్మణునొకనిని తజిమివైచితిని అని శాస్త్రిలవారు తమ గ్రామ్య ద్వేషము నెల్లూరిసభలో వెల్లడిచేసుకొన్నారు. ఈలాగుననే స్విఫ్ట్ అనే ఇంగ్లీషుపండితుడు 'మాబ్' అనే ఇంగ్లీషుమాట వాడినవారిని కొట్టబోయేవాడట. అతడు ఊడుకోకుండాచేయుటకు అడిసన్ తనపత్రికలో ఆశబ్దము గ్రామ్యమని ప్రకటించినాడట! గాని లోకమందంతటా ఆశబ్దము వ్యాపించి ఆకాలమందే సాధుత్వముపొందినది. కొండ వెంకటప్పయ్య పంతులుగారున్నూ పురాణపండ మల్లయశాస్త్రిలుగారున్ను తమ యింటిపేర్లు ఆకారాంతములు కావని వాదించినా, వారి బంధువులున్ను లోకులున్ను ఆకారాంతముగానే వాడుతున్నారు. 'శెనిగపప్పు' అని వై. హనుమంతరావుగారు రచించిన సోమశేఖరవిజయము నందున్నది. (పు. 98). ఈగ్రంథమునిండా ఎన్నో అపశబ్దాలున్నవి; అయినా, కట్టమంచి రామలింగారెడ్డిగారున్ను, రా. సా. గుమ్మడూరి వేంకటరంగారావుపంతులుగారున్ను, దానిని మెచ్చినారు; ఇది కాలేజీవిద్యార్థులకు ఈసంవత్సరము పఠనీయగ్రంథము! పినాకిని పత్రికలో ఒకవిలేఖరి 'చెనిగపంట' 'చెనిగబుడ్డలు' వాడినాడు. ఇదిసం. చణకశబ్దమునకు అన్నిటికంటే దగ్గరగా ఉన్నది. వాడుకభాషలో వైవిధ్యముండుట వైయాకరణులకు వింతగా ఉండదు. దేశాంతరమందున్న వివిధశబ్దరూపములు పాణిని అనుశాసనమందుఉన్నవి. శవర్ణము తెలుగులోలేదని శాస్త్రిలవారి సిద్ధాంతముగాబోలు! 'శనివారము' 'శరణు' తత్సమములా? తద్భవములా? శలవు, శిస్తు, మిశంబరు తెలుగులోచేరినవి. 'శాలువు' తప్పని 'సేలువు' కొందరు వాడుతున్నారు. 'సెట్టి' ని 'శ్రేష్ఠి' ని చేసినారు. 'చెట్టి' కూడానిలిచిఉన్నది. 'శింగకవి' 'శితయ్య' అని సంతకాలు చేస్తున్నారు: మొదటిమాట ప్రాచనశాసనాలలో ఉన్నది. 'పదిశము' న్ను దానికి మందులున్ను పత్రికలలో కంటబడుతూనేఉన్నవి. మనశాస్త్రిలవారే ఉష. లో (పు. 13) 'శబాస్' అని వాడినారు: అదేమో! షకారము

కూడా తెలుగులో ఉండకూడదని వీరిఅభిప్రాయము. క. సా. లోను, ప్రతా. లోను అనేకచోట్ల 'మనిసి' అని శాస్త్రిలవారు ప్రయోగించినారు. క. సా. లో 'మనిసి శవము' (227). 'మనిసిని' (18) 'మనిసిపుట్టె' (206). ప్రతా. లో రాజు వాక్యమందు "మీకు మనిసికి ఒకసర్కారిచ్చెదము" (పు. 44: 3-వకూర్పు). 'అంచెమనిసి' (72). ఈనాటకములోనే చాకలిపేరిగాడిభాషలో 'పెతిమనిసికీ' అని ఉన్నది. 'మనిషి' అని లౌకికభాషలో శిష్టవ్యవహారమందున్నది. దీనిలోని 'ష'కారము అనాంధ్రమనికాబోలు ఆవర్ణముగల తెనుగుశబ్దము గ్రామ్యమంటారు; భాషాదేవికి గ్రామ్యవిషయము తగలకుండా షకారము సకారముగామార్చి 'మనిషి' ని 'మనిసి'నిచేసి, గ్రాంథికభాషలో వాడుటకు తగినశబ్దము పుట్టించినారు. అయితే, లోకములో చాకలిపేరిగాడివంటి పామరజనవ్యవహారమందు సిద్ధశబ్దముగా ఉన్నందుకు పేరిగాడిమాటే ప్రమాణము. సర్వ స్వతంత్రులయిన పండితులు అఘటితఘటనాసమర్థులుగనుక, లోకములో వాస్తవముగా గ్రామ్యమయినది సాధువుగాను, వాస్తవముగా శిష్టజనవ్యవహారమందు సాధువుగా ఉన్నది గ్రామ్యముగాను చేసినారు. ప్రాచీన కావ్యములలో నన్నయ; తిక్కన. ఎఱ్ఱన, శ్రీనాధుడు, మొదలుగాగల కవిపుంగవులు 'మానిసి' అని వ్రాసినట్టు తాటాకుపుస్తకములలో కనబడుతున్నది. అచ్చుపుస్తకములలో 'మానిసి' అని ఉన్నది. అరణ్యపర్వములో ఒకచోట (ఆ. 5. ప. 332) క. అక్కట మృదుగాత్రులు గడుఁజిక్కని మనసులు- అని నాకు కనబడినది. 'మనసులు' అంటే, 'మనస్సు' కలవారు అని అర్థముఅగునా? కాకపోతే 'మానిసి'కి 'మనసి' రూపాంతరమని చెప్పవలసిఉంటుంది. క. సా. లో 'షికారు' గ్రామ్య. మని దానికిమారుగా 'సికారి' అనే శాస్త్రిలుగారు వ్రాసినారు. (చూ. 19.23). అయితే మోర్చింగు (శ ర.) కు మారుగా 'మోర్సింగు' అన్నారు. (చూ. ప్రతా 72). ఇట్లే 'మరుచటి' అని క. సా. (పు. 632) లోను, 'మరుసటి' అని శ. ర. లోను ఉన్నది. 'కొంచెము' అని క. సా. (పు 51, 109) లో. వీజనము(?)విశ(సె)నకట్ట అయిలోకములోన్నా, 'విసనకఱ్ఱ'అని గ్రాంధికముగా వ్రాస్తారు పండితులు (చూ. శ. ర.) అయితే, 'విసరుకఱ్ఱ' అని ఇప్పుడుకొందరు గ్రాంథీకరణము చేస్తున్నారు. ఇది ఇకను విసరుఁగఱ్ఱ అవుతుందేమో. ఉచ్చారణను అనుసరించి ఊయెల, ఉయ్యేల, ఉయ్యల, ఊయల, ఉయ్యాల, పయ్యెద, పయ్యద. బోయెత. బోయత. ఆయెలే, ఆయలే, అనే రూపములు ఏర్పడ్డవికావా?

(4) 'ఊసరవిల్లి' లోకములో ఉన్నది. వ్యుత్పత్తిని పట్టిచూస్తే ఊసరవల్లి (సం. పల్లి బల్లి) సాధువు కాబోలును. కన్నడములో 'ఊసరవళ్లి.' 'ఊసరుళ్లి.' కొందరు తెలుగువారు 'ఊసపిల్లి' అంటారని బ్రౌ. ని. లో

ఉన్నది. "పల్లి"కిమారుగా 'పిల్లి' అనుటకు 'చెరుకుపిల్లి' వారని, చెరుకుపల్లి (చెరకుంబల్లి)కి మారుగా వాడుట దృష్టాంతము. ఇది మల్లె మల్లి మొదలయిన వాటివలెనే అయినది. క. సా. లో శాస్త్రిలవారు పల్లి, పల్లిని, పల్లికి, అని వ్రాసి ఎందుకు దిద్దుకొన్నారు? 'పల్లి' సాధువు కాదా? ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు 'రహస్యదర్పణ' మందు 'గురివిందగింజలు' (పు 112) అని వాడినారు (శ. ర గురివెంద). ఏమిచేయను?

(5) గెలుచు, గెలుపు, గెలిచెను, గెలవగలనా, అని అచ్చు వ్యత్యస్తముగా వాడుట దోషమని ఆక్షేపించినారు. కాని తెలుగులో ఒక శబ్దము ఉకార మధ్యమమో అకారమధ్యమమో ఇకారమధ్యమమో నిరూపించుట ఎంత కష్టమో ఆలోచించినారుకారు. యతిస్థానమందు కనబడితేనేకాని అచ్చు ఇద మిత్థమని నిశ్చయించి చెప్పశక్యముకాదు. అట్టిస్థానమందే వివిధముగా కావ్యములలో కనబడినప్పుడు రూపాంతరములు కోశములలోనికిన్ని, వ్యాకరణములలోనికిన్ని. అప్పుడప్పుడు లాక్షణికులు చేర్చుకొన్నారు. ఇంకా చేర్చుకోవలసినవి కొన్ని కనబడుతున్నవి. • ఒక్కొక్క కాలమందు ఒక్కొక్కవిధముగా శబ్దరూపము లున్నవి. నన్నయ మొదలయిన ప్రాచీన కవులు 'నడచు (నడక, నడ) మిక్కుటము (ధా. మిక్కు, మిక్కిలి), బోరన, దిగ్గన, నాలుక, కానిక, సడలి. * పగుల్చి'.+ అని వాడినట్టు యతిస్థానమందు డ, కు, ర, గ, లు, ని, డి గు, వర్ణములు కనబడుతున్నవి. ఉత్తరాంధ్రకవులు 'నడుచు, మిక్కుటము, బోరున, దిగ్గున, కానుక, సడలి, పగిల్చి, అని వాడినట్టు అట్టి నిదర్శనమే ఉన్నది. తమ పూర్వుల వాడుకను అనుసరించకుండా దానికి భిన్నముగా ఉన్నా తమకాలపు వాడుకనుపట్టే వారు వ్రాసినారనక తప్పదు. శ-ర-లో అనేక శబ్దముల రూపము నిర్ణయించలేక సీతారామాచార్యులుగారు చాలా చిక్కులు పడ్డారు. వారికి తెలిసినంతవరకు చెప్పి దొరికిన ప్రమాణములను చూపించినారు. తక్కినవి విచార్యములన్నారు. ఎవరైనా మరేమిచేయగలరు? 'తొరఁగు' గురించి 'గ్రంథములయందు అంతట ఇది అకారమధ్యముగానే కబడుచున్నది. అయినను ఒక మహాకవి మాత్రము ఉకారమధ్యముగా ప్రయోగించియున్నాడు' అని వ్రాసినారు. నాకు తాటాకు పుస్తకములలో 'తొరుఁగు' అని ఉకార మధ్యముగానే కనబడ్డది. ఈ విచారణలో ఎట్టి చిక్కు గలదో తెలియజేయుటకు ఒకశబ్దము తార్కాణముగా చూడండి: 'ఎగచు'

---

• మెలుత (అనుశా. III 221)—'లు' యతి. శ-ర-లో మెలఁత ఉన్నది గాని మెలుఁత లేదు.

* సడిల్పక (కాశ్య. IV.12—'డి'యతి)

\+ పగుల్చి (హరివం. పూ. IV. 148. 'గు' యతి.)

'ఎగుచు' అని రెండురూపములున్ను శ-ర-లో ఉన్నవి. రెండింటికి ప్రమాణముగా నిర్వచనోత్తరరామాయణము ఆ. 3. 33 వ పద్యమే ఉదాహృత మయినది. దానిలో కొట్టకొనను ఒక్క చోటనుమాత్రమే ఈ శబ్దము ఉన్నది. అది 'ఎగచు' శబ్దముక్రింద 'ఎగవన్' అనిన్ని "ఎగుచు" శబ్దముక్రింద 'ఎగువన్' అనిన్ని పాఠభేధములతో ఈ ప్రమోగమే ప్రమాణముగా కనబడుతున్నది. ఆ ఒక్కపద్యములోఉన్న ఆ ఒక్కశబ్దమే రెండువిధములా ప్రమాణమనిచెప్పి రూపాంతరములు సాధించడము యుక్తమా? తాటాకు పుస్తకములలో 'ఎగపన్' మాత్రమే నాకు కనబడినది. కనుక నాబుద్ధికి 'ఎగచు' అకారమధ్యమని తోస్తున్నది 'ఎగచి యెగచి యందు నెగయకుండబట్టె' అని నలచరిత్రమునందు నన్నయ వ్రాసిన పద్యములలో 'గ' యతిస్థానమందు లేకున్నా దానినిపట్టి అకారమధ్యమని ఊహించి శ-ర-లో ఉదాహరించినారు.

ప్రస్తుతవిమర్శకు విషయమైన "గెలుచు" ధాతువు ఉకారమధ్యమని శ. ర. లో ఉన్నది; గాని 'గెలివు' ఎందుండివచ్చినది? (శ. ర. లో ఉన్న "గెలివి" రూపము తప్పుగాబోలు. ఇది 'ఉలివు, తెలివు' వంటిది. శ. ర. లో ప్రయోగము లుదాహరించలేదు. శల్య. III 100-క, 'ఈ గెలివేలార్చెద'-లో, గెలివు + ఏల + ఆర్చెద అనిశబ్దములరూపములు) కన్నడములో 'గెల్' ధాతువు; గెలల్, గెలవు కృదంతములు; గెలితు క్త్వార్థకము; గెలువికే, గెలువు అనేరూపములుకూడా ఉన్నవి. అట్లే అరవములో "కెలి" ధాతువు. "కెలిప్" కృదంతము. ధాతువులనేవి కొన్నిశబ్దముల రూపములు ఆధారముగా చేసుకొని లాక్షణికులు కల్పించిన ప్రకృతులుకాని సహజమైన సిద్ధశబ్దములు కావు. భాషాశాస్త్రసంప్రదాయము చొప్పున 'కెల్' ధాతువు అనేకకారణముల చేత అనేకవిధములుగా శబ్దములరూపములు మారుతవి. ఈవిచారణ ఇక్కడ విస్తరించి చేయుటకు అనువుపడదు. ఇట్టివివిధరూపములు శాస్త్రిలవారి గ్రంథములలోను వారు మెచ్చుకొన్న వారి గ్రంథములలోను చూపించువారివలెనే బాలురపొత్తములను రచించినవారున్ను వ్రాసినారనిమాత్రము సమాధానము చెప్పవలెను. ఇవి లోకములో ఉంటే వ్యావహారికభాషలోనివి అవుతవి. ప్రాచీనగ్రంథములలో ఉంటే, ప్రాచీనాంధ్రభాషలోనివి అవుతవి. ఎందున్నూ లేకుంటే అపశబ్దములు అవుతవి. శాస్త్రిలవారి ప్రయోగములు కొన్ని వర్గీకరణముచేసి చూపిస్తాను. వ్రతకల్పములోని 'తీసుకొని' (102); క. సా. లోని 'తగలఁబెట్టిరి' (21), 'దొరికిన' (524) "పడక" (401) "ఒడిలి" (232) [శ. ర.-'వడలు' ధాతువు], 'ముసురుకొని' (149) 'మఱచి' (232) 'కదపక' (195) (కదలు-ధాతువుకు ప్రేరణార్థకము) "దగ్గిర" (44, 57) బొపడు*

* ప్రతా. లో చాకలివాళ్లభాషలో 'బొపడు' ఉన్నది.

(4) అగుపడుట (8) అగుపడెను (18) అగుపడును (30) అగుపడి (31) అగుపడుచున్నది (36) అగుపడఁగా (49) అగుపడక (56) అగుపడలేదు (56), [ఇట్టివి 15 చోట్ల ఉన్నవి]-ఈ మొదలయినవి ప్రాచీనకావ్యభాషలో లేవు; అందులో అసాధువులు వర్తమానవ్యావహారిక భాషలోఉన్నవి ; అందులో సాధువులు, క. సా. లోని మఱవక (474) తఱిమి (426)-(గురు రేఫము గానీ లఘు రేఫగానీ) ఈ మొదలయినవి ప్రాచీనకావ్యభాషలోను, వర్తమాన వ్యావహారికభాషలోను ఉన్నవి ; రెంటికిన్ని సామాన్యము క. సా. లోని 'వెదకు' (86) బెదరించె (118)-ఈలాటివి; కేవలము ప్రాచీనకావ్యభాష లోనివి. వ్రతకల్పములోని అడగి (81) [అడిగి] క. సా. లోని కదులని (497) వెదుక (85, 210 327), తడువసాగెను (281) [తడపు. టుమర్థక రూపము], తరముకొని (256)-పదనొకండుగురు (374) ఈలాటివి ఎందు నూపొందని అపశబ్దములు; కృతకభాషలోనివి. ప్రాచీనకావ్యభాష లెస్సగా అభ్యసించక వర్తమాన వ్యావహారికభాష గ్రామ్యమని త్యజింప నుద్దేశించి లౌకికభాషలోని శబ్దముయొక్క రూపము యథేష్టముగా మార్చి చిత్రమైన గ్రాంధికీకరణవిధాన మేర్పరచుకొని కొందరు పండితులు గ్రాందిక భాషాభి వృద్ధిచేస్తున్నారు. లోకములో దొరకదు, వెదకవలెను అనిఉన్నవిగనుక. అవి గ్రామ్యములట. అకారము తీసి ఉకారము పెట్టగానే గ్రామ్యత్వముతొలగి గ్రాంథికమయిపోతుందట ! దొరుకదు (గురురేఫముంటే మరీమంచిదని దొఱు కదు), వెదుకవలెను అనికొందరు పండితంమన్యులు వ్రాస్తున్నారు. అట్టే చర్చ ఎందుకు ? శాస్త్రిలవారు మెచ్చుకొన్న గ్రంధములలోకూడా శబ్దరూపములు ఏలాగునమారిఉన్నవో చూస్తే భాషాదేవికి ఎవరు విషప్రయోగములుచేసినారో తెలుస్తుంది. శివాజీ చరిత్రలో వెదుక (78) వెదకి (78) వెదకుచు, దొరకు, దొఱకు (164), వి. స. లో కదువు (118) కరిగి (152) దొరికిన (347) దొరకలేదు (379) దొరికి (617) దొరకక (619) అగుపడు (558) పెరుగును, పెరగవు (657) నరికిన (657) నరకరు (657) ఆం. సా. పత్రికలో అగుపడును. (I.67, 11, 195) ఒరిగి (I. 64) వెదుకగా (I. 67) తరవాయి (I. 46) దొరికిన (II. 26) ఆం. చ. లో అగుపించదు (I. 96) దగ్గఱ (I. 96) క. సా. మొదటకూర్పులో 'ఒద్దికి' అనేకవేల వాక్యములలో ప్రయోగించి రెండవకూర్పులో 'ఒద్దకు' అని అన్నిచోట్లను దిద్దుకొన్నారు. ఇది అసాధువుకాదు. ఉత్తరాంధ్రకావ్యములలో తరచుగా కనబడుతున్నది. తిక్కన్నకూడా వాడిఉన్నాడు. (చూ. విరా. I. 230 ఉద్యోగ IV. 105)

"నీవు చాలాబాగా పాడుతావటే !" "పకోడీలు కరకరలాడుచు బాగానే యున్నవి." "నీకుదానిరుచి బాగానే తెలియును" మరియొక వాలంతిలో "బంఘ

త్వము తెలియజేసేమాటలు బాగా బోధపడ్డతర్వాత" అనిమాటిమాటికి "బాగా" ప్రయోగము. ఎఫ్. ఏ. పరీక్షకుపఠనీయమైనయొక నాటకంపుఁదోఁబుట్టువు నాటకములో అనథ మోక్తిగా ఈ "బాగా" ప్రయోగము అయిదాఱు మాఱులు కావింపబడినది. అందే ఇట్లుండగా అట్టివానింజదివి పండితులయిన వారిపొత్తము లలో నిట్లుండుటయాశ్చర్యమా? అయినను "బాగాయన్నది" అని అందున్న కళాత్వమునుదిద్ది యిందు "బాగానే" అనిద్రుతముంచుట మేలుగదా.

ఇది అతిసులభమైన శబ్దము. "బాగుగా" లేక "బాగుగ" అనిసాధు ప్రకృతి, దానికి "బాగా" అని గ్రామ్యము. ఇట్లేపెద్దపెద్ద వారిగ్రంథములలో "ఆనక" శబ్దము చొచ్చినది. "అలానా?" "ఆమట" అనువానిని ఇంకనునేను ఆధునికవాఙ్మయమునం గన లేదు.

విమర్శము:— 'చాలా' 'బాగా' తప్పులట! 'చాలా' శ. ర. లోలేదు; గాని, ల. నా. లో ఉన్నది; ద్విరూపకోశములోను, దేశ్యనామార్థ కోశములోను ఉన్నది. 'చాలఁ' అనగా చాలునంత, చాలునట్లుఅని మొదటఅర్థ ముండెను. కాని, "అధికముగా" అనేఅర్థము తెలియజేయుటకు 'చాలా' అనేది అవ్యయముగా వాడుకలోనికివచ్చి మున్నూరుసంవత్సరములయి ఉంటుంది. ఇట్లే 'కూడా' (కడ) తేరా' 'నోరారా' 'తీరా' 'ఇంకా' 'అంతా' 'తిరిగీ'— మొదలయినవి భాషలో పరిణమించినవి. దీర్ఘముచేత అర్థవిశేషమేర్పడుతుంది. 'ధనము కూడబెట్టు' 'ధనముకూడా పెట్టు'—ఈ రెంటికిని ఒక్కటే అర్థము కాదు. 'చాలా యభివృద్ధి (ఆం. పత్రిక పుట 8. 10-1-23), కూడ యుండ వలయును (ఆం. ప. పు. 10; 10-1-23)—ఇవి తప్పులు. దీర్ఘముమాని హ్రస్వమువాడితే శబ్దార్థముమారి వ్యవహారహాని సంభవిస్తుంది. వ్యవహార సౌకర్యముకోసమే భాష ఉన్నది. వ్యవహారమునకు హాని కలిగించే భాష ఒక్క నిరర్థకమే కాదు. అనర్థకముకూడా అవుతుంది. మరి చర్చించకుండా ప్రసిద్ధకవుల ప్రయోగములు ఉదాహరిస్తాను. అనిరుద్ధ చరిత్రము (ii 83), ఇందుమతీ పరిణయము (iii· 40) కుచేలోపాఖ్యానము (III 75), కవికర్ణ రసాయనము (IV. 164), గంగా గౌరీ సంవాదము (పు. 17), దశావతార చరిత్రము (పు. 47), ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము (పు.27) ప్రభు లింగలీల (పు. 21), బసవ పురాణము (పు. 102), రామస్తవ రాజము (పు. 35), వాసిష్ఠ రామాయణము (కొత్తది XII. 12, 78, 88), వేంకటే శ్వర మహాత్మ్యము (159), అప్పకవీయము (1859 సం. మొదలు ముద్రిం చిన కూర్పు లన్నిట IV, పుటలు 165-188 లో ఎనిమిదిచోట్ల). విజయ

విలాసము (మొదటి కూర్పు III. 56), రంగరాయ చరిత్రము* (II. 48, 148), కవిరాజ మనోరంజనము (పు. 87)—వీటిలోనే కాక శతకములలోను, కీర్తనలలోను, అనేక ప్రయోగములున్నవి. టీకలలోను వచన గ్రంథముల లోను అపరిమితముగా పండితులు వాడినారు. పరవస్తు శ్రీనివాసాచార్యులవారు సర్వశబ్ద సంబోధినిలోను, రంగాచార్యులవారు శ్రీనివాస రక్షణములోను 'చాలా' శబ్దము వాడినారు. మన శాస్త్రిలవారు 'చాలా' శబ్దము ప్రయోగించి నట్టు నాకు ఎక్కడా కనబడలేదు. గాని, వారు మెచ్చుకొన్న వి. స. లో 'చాలా భాగము' (పు. 428), 'చాలా యుగములు' (450) 'చాలా ఎత్తు' (470) ఉన్నవి. సంపాదకులు మ॥ కొ. వెం. లక్ష్మణరావుగారు రచించిన హిందూదేశ చరిత్రలో మహమ్మదీయ యుగమందు 'చాలా దూరము' (238) ఉన్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి పుస్తక భాండాగారాధికారి మ॥ క్రొ. సూర్యారావుగారు 'ఫసానే అయాజబ్' అనే గ్రంథములో 'చాలా' ఇరవై అయిదు చోట్ల వాడినారు, అన్నట్టు చెప్ప మరచినాను. ఆంధ్ర పండితోత్తములు శ్రీ సూర్యారాయ బృహదాంధ్ర నిఘంటు సంపా దకులు ఆంధ్రపరిషత్ ప్రతిష్ఠాపకులు మ॥ జయంతి రామయ్యపంతులుగారు తమ ముక్తీశ్వరశతకములో "క. చాలా లాభముగోరినఁ, గేలఁ గలదిగూడ వెచ్చగించవలయుఁ—" (55)అని వ్రాసినారు. ఆంధ్రపరిషదధ్యక్షులు, ఆంధ్ర కాళిదాస బిరుదాంకితులు అపరిమితముగా ఆంధ్రగ్రంథములు రచించినవారు మ॥ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు సారంగధర నాటకములో సారంగధరునివాక్యములందే వాడినట్టు మూడు కూర్పులలోను కనబడుతున్నది. అప్పకవికి పూర్వమునుంచిన్ని లోకములో ఉన్నట్టిది, ద్విరూపకోశములో గణపవరపు వేంకటకవి చాలాకాలము క్రిందటనే చేర్చినట్టిది. లక్ష్మీనారాయ ణీయ మనే కోశములో 16 ఏండ్లయి ఉన్నట్టిది, కావ్యములలో ప్రాచీన కవి పుంగవులు ప్రయోగించినట్టిది, ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులు వాడుతున్నట్టిది, బృహదాంధ్ర నిఘంటు నిర్మాతలంతటి ప్రఖ్యాత పండితులు స్వకీయకావ్య మందే ప్రయోగించినట్టిది. సాధుశబ్దము కాదనుటకు కారణమేమిటి ? ఇప్పుడు తాము నిర్మిస్తూఉన్న బృహదాంధ్ర నిఘంటువులో దీనిని నిర్మాతలు చేర్చుకోక పోతే ఈ శబ్దము వాడుతూవున్న ఆంధ్రలోకమునకు, దానిని ప్రయోగించిన ప్రాచీన కవులకు, దానిని కోశమందు చేర్చిన పూర్వాలాక్షణికులకు, ఆంధ్ర

---

* "శా. ఆమాటల్ విని........చా
లాముఖ్యంబుగ........" అని

'లా' యతిస్థానమందున్ను 'ము' ప్రాసస్థానముందున్ను ఉన్నవి. 'చాలన్' అని దిద్ద వాటము కాదు.

సాహిత్య పరిషత్తుకు. దాని అధ్యక్షులకు, వీరందరితోపాటు తమకున్నూ, యెంత అగౌరవముగా ఉంటుందో ఆలోచింతురుగాక; లోకమందు సార్వత్రికమై భూరిప్రయోగమహిమచేత సాధువయిన శబ్దములు విడిచి లోకములో గాని, ఆంధ్రసారస్వతమందుగాని, లేనిశబ్దములు వేనవేలు సంస్కృతకోశము లోనుంచి యెత్తుకొనివచ్చి చేర్చినందువల్లనా శ్రీ సూర్యరాయ బృహదాంధ్ర కోశముయొక్క బృహత్త్వసార్థక మవుతుంది? 'బాగా' తప్పుకాదు. శిష్టజన వ్యవహారమం దున్నది. బ్రౌ. ని. లో ఉన్నది. "వాతాత్మజునికి బాగాతెలుసురా" అని త్యాగరాయలు పాడిన పాటలో వినబడుతున్నది. బాగుగా-బావుగా బాఉగా బాగా బాగ అయినది. దీనిలో ఉచ్చరణ సౌకర్యము కనబడుతున్నది. పోవదు, పోదు: తటాలున, తటాల్న, తటాన అని కవులు వాడినారు. చక్కా (చక్కగా) అని వాడుకలో ఉన్నది. "నీ తండ్రి బాగున్నాఁడు" అని సులభవ్యాకరణమందు వా. సుబ్బారావుగారు ఉదాహరణగా ఇచ్చినారు. (చూ. III. పు. 14) బాగున్నాడు=బాగ (బాగా-బాగుగా)+ఉన్నాఁడు. వి. స లో "బాగుండును" (పు. 1526) అని ఉన్నది, "వానిని గ్రద్దల కేసెద" అని ఉష. లోను (పు. 52) "వడలిపోవు" కు మారుగా 'ఒడిలిపోవు' అని క. సా. లోను (పు. 232) వ్రాసినవారికి ఇది తప్పుగా తోచినదేమి? 'ఆలాగే' 'ఏలాగున్నది' మొదలయినవి పండితులు అపరిమితముగా వాడుతున్నారు. 'ఆలాగే' క. సా. లో ఉన్నది (పు. 11, 30, 74). ఇది 'ఆలాగుననే' అని ఉండవద్దా? 'ఆనక' అనేదేకాదు 'ఆక' అనేదికూడా గ్రంథాలలోని కెక్కినది. మ॥ తేకుమళ్ల రాజగోపాలరావుగారి లలితలో 'ఆనక ప్రమాదము వచ్చును' అని 121 వ పుటలోను 'అన్ని సౌభాగ్యాలు అయినాకనే' అనిన్ని 'ఈ పెద్దాపురం చేరాక' అనిన్ని 129వ పుటలోను ఉన్నది. "ఆలానా?" అనే దానిని ఇంకను ఆధునిక వాఙ్మయమునం గనలేదు' అని శాస్త్రులవారన్నారు. ఆధునికము మాటకేమి? ఆధునికగ్రంథములు గ్రామ్యభూయిష్ఠములని వారు వాటివైపు చూడనైనా చూడరు. పూర్వకవుల కావ్యములైనా వారు తిన్నగా చూచిఉన్నట్టు కనబడదు. దశావతార చరిత్రలో 'శా. ఈలాశూలము గేలఁ బూని లయకాలేశానుచందంబుననన్' అని ఉన్నది. (ఆ. 4. పు. 130) భారతమునందున్న 'నేరనయ్యేదను' వంటిప్రయోగములు కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు ప్రయోగిస్తే తప్పులని ప్రసన్నరాఘవవిమర్శములో చెడనిందించినవారికి ప్రాచీనాంధ్రవాఙ్మయము సుపరిచితము కాదనక తీరదు. "ఏలాటి" అనేశబ్దము తప్పని మ॥ వావిలికొలను సుబ్బారావుగారు సులభవ్యాకరణములో వ్రాసినారు. అప్పకవి ఈశబ్దము వాడినాడు. వేంకటరాయశాస్త్రులవారే అనంతవ్రతకల్పములో "ఆవృషభమేలాటిది?" (చూ. 67) అన్నారు. ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక (VI,

50) లో "ఏలాటి" ఉన్నది. ఒకరికి సాధువయినది మరి ఒకరికి అసాధువు. అంతా పండితులే! అంతా విమర్శకులే! వారిలో వారికే వివాదాలు పుట్టినపుడు ఎవరి మాటలు లోకులు పాటించవలెనో తెలియదు. ప్రాచీనాంధ్ర వాఙ్మయము బాగా చదువుకోని వారికి ప్రాచీనాంధ్రభాషా లక్షణము సంపూర్ణముగా ఏలాగున తెలుస్తుందో! అట్టివారు ఆంధ్రభాషా విమర్శకులయి, నోటికి వచ్చినట్టూ ఇది తప్పు అది ఒప్పు అని కారణము చూపించకుండా ధూంధాం అని బూకరిస్తే వీరి భేషజాలు చూచి సామాన్య జనులు మోసపోతారు. బుకాయించగల పెద్ద పండితులు చెప్పినదానిలో తప్పొప్పులు తెలిసికోగలవా రరుదు. అది చూపించుటకు చిన్న పండితులు మొగమాటపడతారు. ఎవరేమన్నా, సామాన్యులు నోరుమూసికొని ఊరుకోవలసినదే. ఇట్టిదా దేశభాష? లౌకికభాష? తెలుగు వారి మాతృభాష?

'ఆమట' తప్పుకాదు. ఆమ్ + అట. 'ఆమ్' చాలా ప్రాచీన శబ్దము; 'అగును' అని అర్థము: అరవములోను, కన్నడములోను ఉన్నది.

"కూర్చుండు" ధాతువునకై కొందఱు పడినపాట్లు పరిహాసనీయములే గాక అనుశోచనీయములుకూడ నై యున్నవి:-కూర్చుని, కూర్చొని, కూర్చున్న, కూర్చొన్న, కూర్చున్నాఁడు, కూర్చొన్నాఁడు. ఇత్యాది బహురూపములను ఒక్క కవియే ప్రయోగించియున్నాఁడు. I have a house అను వాక్యమునకు తెనుఁగు నేర్పిన శిశుబోధకుఁడు తొట్టతొలుత కలుగు దాతువును సకర్మముగావించినాఁడు. "I నేను, a house ఒక ఇంటిని, have కలిగియున్నాను," అతని యుపదేశము ఆ సాంప్రదాయమున సకర్మకత్వము నాటకాంతము వ్యాపించినది. ఆధునిక వాఙ్మయము నుండి ఎన్ని ప్రయోగములనేని యుదాహరింపవచ్చును. బడి పుస్తకములలోను సమృద్ధిగానే కలవు. మూఁడవ తరగతి పాఠపుస్తకమున (Third class Reader-Marsden's) 24 వ పుట, "కిటికీలను గొన్నిటిని మాత్రమే కలవై యుండును."

విమర్శనము; 'కూర్చుని' 'కూర్చొని' 'కూర్చొనెను' 'కూర్చో' 'నిల్చో' 'ఊరుకో' ఇటువంటివి ప్రాచీన భాషలో లేవు. వర్తమాన వ్యావహారికభాషలో దేశమందు అంతటా ఉన్నవి. ఆధునికకవుల కావ్యములలో వాడినారు; వాడుతున్నారు. 'భేషజ కల్పము' అనే వైద్య గ్రంథములో "మ........ప్రాఙ్ముఖం బునుదగ్వక్త్రియునైన గూర్చుని...." (ఆ. 4 ప. 13) అని వ్రాసిన కవి మొదటివాడు కాబోలు. మిక్కిలి ప్రఖ్యాతిపొందిన మతుకుమల్లి నృసింహవిద్వన్మణులచే 60 ఏండ్ల క్రిందట దుందుభి సం. లో ప్రణీతమైన చెన్నపురీ విలాసమున 43 వ పుటలో "చ....వ*జ్జులు గొని దారుపాళి పయిగూర్చుని వ్రాయుచు...." అని ఉన్నది. నారపరాజు కాంతకవి రచించిన కవిజనచకోర

చంద్రోదయమునందు "కూర్చొని" పదమూడుచోట్ల ఉన్నది. శ్రీ వెంకటగిరి మహారాజావారి ఆస్థాన కవీశ్వరులు గోపీనాథ వెంకటకవిగారు కృష్ణజన్మ ఖండమునందు "క. వదలక కూర్చుని ప్రాగ్గిరి" (పు. 120) అనిన్ని, "చ.... కొలువయి రత్నపీఠమునఁ గూర్చునియుండగ...." (పు. 120) అనిన్ని వ్రాసినారు. ఆంధ్ర సాహిత్య పరిషదధ్యక్షులు శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు పంతులుగారు నర్మదాపురుకుత్సీయములోను (రెండవ కూర్పు పు. 119), సారంగధర నాటకములోను (3వ కూర్పు పు. 31) "కూర్చుని" మాత్రమే కాక "నిలుచుని" కూడా నర్మదాపురుకుత్సీయములో (పు. 136) ప్రయోగించినారు. ఊరకొనుము, ఊరుకొమ్ము అనికూడా దానిలోనే ఉన్నవి. అముద్రిత గ్రంథ చింతామణి (1896, పు. 107) లో పత్రికాధిపతులు "తిక్కన సోమయాజిగారు కూర్చొని భారతము వ్రాసిన స్థలము" అని స్వయముగా వ్రాసినారు. విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలోని పుస్తకములందు తరచుగా ఈ శబ్దములు కనబడుతున్నవి. వ్యవసాయ శాస్త్రము (II. పు. 240, 241) లో "కూర్చుని" చంద్రగుప్త చరిత్రములోను, లింకనుచరిత్రము (148, 154) లోను "కూర్చొని" మ॥ కట్టమంచి రామలింగారెడ్డిగారుకూడా అర్థశాస్త్రము (పు. 150, 189, 203) లో కూర్చొని 'కూర్చొనవచ్చును' అని వ్రాసినారు. వి. స. లో "వృక్షమూలమునగూరుచొని" (పు. 270) 'కూర్చొనిన' చోటనే (పు. 509) 'కూర్చొని' (707); ఆంధ్రపత్రికలో ప్రతిదినమున్ను 'కూర్చుని'గాని కూర్చొనిగాని కంటబడుతూనే ఉంటుంది. ఆంధ్ర పత్రికసంపాదకీయవ్యాసములందు (2-1-23: పు. 7; 8-1-23: పు. 9) 'కూర్చొని' దుందుభి సం. ఉగాది సంచిక (పు. 193) పద్యములలో 'కూర్చొనె' వచనములో 'కూర్చుని' (పు. 227) వందేమాతర ప్రచురణములలో తరచు రామదండులో 'కూర్చొని' 'కూర్చుని' మహాత్మాగాంది ఆరోగ్యదిగ్దర్శినిలో 'కూర్చొనుటకు' (13) కూర్చుని (24) కీర్తిశేషులయిన మ॥ గురుజాడ వెంకటప్పారావుపంతులుగారు 'కూచుని' అని ఒక కావ్యములో ప్రయోగించినారు. పాటలలోను, పదాలలోను, కీర్తనలలోను దేశమంతా 'కూర్చుని' 'కూర్చొని' 'కూచుని' అని అంటూఉన్నారు. సార్వత్రికమైనదానిని మనశాస్త్రులవారు గ్రామ్యమని నిందించి రూపుమాపగలరా! గ్రామ్యభాషను నిర్మూలింపవలెనని దీక్షపట్టినవారే చాలాధనముపెచ్చించి 'ఇట్టిగ్రామ్యము' గల గ్రంథము అచ్చువేయించిగ్రామ్యము వ్యాపింప జేసినవారయినారు. ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షుల నాటకములనిండా కావలసినంత గ్రామ్యమున్నది.

"కలుగు" ధాతువు సకర్మకమనికూడా శ. ర. లో ఉన్నది. పండితులనేకులు అశ్లేనమ్ముతున్నారు. వి. స. లో "గ్రామములను పల్లెలను గలిగియుండును" (పు. 486). గ్రామములలక్షణములనే కలవిద్మై (పు. 1330) 'అధికారమునే కలిగియున్న దేశముఖులు' (పు. 1365). ఇంకా అనేక ప్రయోగము లిట్టివి ఉన్నవి.



# ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము

## ముందుమాట

["భాషాదేవికి ఆధునిక వాఙ్మయమువలనం గలిగిన యీ వాపును ఇంకను జీవధాతువుండఁగానే పండిత భిషక్కులు కలిసి యాలోచించి తగిన మందులచే తొలగించి ఆరోగ్య మొసంగుదురు గాక యని మదీప్సితము" అని బ్ర. శ్రీ. వేదము వేంకటరాయ శాస్త్రులవారు ఆంధ్ర సాహిత్య పరిషదష్టమ వార్షికోత్సవ సభలో అధ్యక్షులుగా నుండి హెచ్చరించినారు. (చూ. ఆం. సా. పత్రిక. VIII. పుట 92.)

మా ఉపదేశము ఏమిటంటే:—ఇద్దరు భాషాదేవు లున్నారు. వారిలో నొకతె లౌకిక భాషాదేవి. ఆయమ్మకు రోగమేమీ లేదు. పెద్దల యిళ్ళే ఆయతనముగా చేసుకొని, వారి నోటిమాట మీరకుండా ప్రవర్తిస్తూ అందరితో కలసి మెలసి, హాయిగా ఆడుతూ, పాడుతూ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి కలిగి, కులుకుతూ ఉన్నది. ప్రత్యేకముగా తమకోసమే పండితులు ఉంచుకొన్న భాషాదేవమ్మగారు, ప్రబంధబద్ధయై, ముసుగు వేసుకొని శుద్ధవాయువు, వెలుగులేని చీకటిగదిలోనే పడుండి వ్యాయామము లేక, వింత వింత రోగాలెన్నో తగిలించుకొని, ఎప్పుడుచూచినా మూలుగుతూ ఏ క్షణమో ఏ గడియో అన్నట్టుంటారు. ఆయమ్మగారి రోగాలు పండిత భిషక్కుల భేషజాలవల్ల కుదిరేవి కావు. వీరి భేషజాలవల్లనే కొన్ని రోగాలు పుట్టినవి, వాటివల్లనే అవి ముదిరినవి. అవి కుదరకపోవడమే కాక కొత్తరోగాలుకూడా పుట్టుతున్నవి. పండిత భిషక్కుల నిదానము తప్పినది. ఈ రోగాలకు ఒకటే చికిత్స. ముందుగా విరేచనాలకు మందిచ్చి అజీర్ణ పదార్థాలు తొలగించి, లౌకికభాషాదేవి సంరక్షణలో పండిత భాషాదేవిని ఉంచితే, ఆమె పెట్టే పథ్యపానాలచేతను, చేసే ఉపచారములచేతను, రోగాలు కుదిరి ఈ దేవిగారు ఆరోగ్యవంతురాలు కాగలరు. లౌకికభాషాదేవితో కలసిఉన్నంతకాలము పండితుల భాషాదేవిగారు ఆరోగ్యము గలిగి బ్రదుకుతారు. వారి పరస్పర సంబంధము తెలియక, పండిత భిషక్కులు చేసే భైషజ్యము వ్యర్థమవుతున్నది. గనుక భాషాతత్త్వము తెలుసు

కొని, భాషారోగములకు భాషాభిషక్కులు భైషజ్యము చేస్తే కృతకృత్యులవుతారు నాన్యఃపంథావిద్యతేఽయనాయ. ఓం. శాంతిః శాంతిః."].

1. లౌకిక భాష శిష్టజన వ్యవహార సిద్ధమయినది గనుక పూజ్యమేగాని ఎంతమాత్రమూ నింద్యము కాదని మా మతము. శిష్టజన వ్యవహారసిద్ధమయినా లౌకికభాషగ్రామ్యమే అనిన్ని, గ్రంథములలో వాడుటకుతగినదికాదనిన్ని కొందరు వాదిస్తున్నారు. ఆలాగున వాదించేవారి మతము మా మతమునకు విరుద్ధమయినది గనుక వారితో మాకు వివాదము గలిగినది. వారి వాదమును మేము ఖండించుటకు పూనుకొన్నంత మాత్రముచేత వారియెడల మాకు గౌరవములేదని తలంచ గూడదు. మాకు మిత్రులున్ను పూజ్యులున్ను అయిన పండితులతోనే ముందుగా మేము వాదించవలసి వచ్చినది. మా మతము గ్రాహ్యమని ప్రతివాదులనేకులు ఒప్పుకున్నారు; ఒప్పుకోనివారు ఇంకా అనేకులున్నారు. అందరినీ మామతములోనికి తిప్పవలెననే మా అభిలాష అందుకై ప్రయత్నము చేయడము మాత్రమే మావంతుపని. దురభిమానము దురహంకారముగలవారు సత్యము ప్రత్యక్షమయినా ఒప్పుకోరు; అలాటివారు మా మతము నిరాకరిస్తారని మేమెరుగుదుము. మాప్రతివాదులలో కొందరు సరళహృదయులున్నారు. వారియెడల మాకు చాలా గౌరవము కలదు. అట్టివారిలో కొందరితో సంధికోసమై అభియోగము చేయడము తగిన ఉపాయముగాతోచి ఈవ్యాసము వ్రాస్తున్నాము. పెద్దలతో అభియోగము అభివాదపూర్వకము గనుక ఒక్కొక్కరిని గూర్చి వ్రాసిన గ్రంథ మొక్కొక్క అభివాదనముగా విభజిస్తున్నాము.

2. మా అభియోగవిధానము వివరిస్తున్నాము. ప్రతివాదులు తమ తోడి పండితుల భాషలో ఏదోషములు చూపించినారో ఆ దోషములుగాని అట్టివిగాని లౌకిక భాషాలక్షణానుసారముగా ఉంటే, అవి దోషములు కావని సాధించడము మా పని. అవి వాడిన పండితులు, ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా, మా మతములోనివారే అవుతారు. ఇతరుల గ్రంథాలలో తప్పులుగా తాము ఎంచిన శబ్దములు తమ గ్రంథములలో కూడా కనబడినప్పుడు తాము తప్పులు వ్రాసినవారు అయి, "గ్రాంథిక భాష" లెస్సగా రానివారనిపించుకొంటారు. మా ప్రతివాదులు "గ్రాంథిక భాష" తప్పులు లేకుండా వ్రాయలేరు అని సప్రమాణముగా సిద్ధాంతముచేయ బూనుకోవడములో దురుద్దేశము ఏమీలేదు. నిజము చెప్పకేమి ? బహు జాగ్రత్తగా పరిశీలించి చూడగా, "లాక్షణికులు", "పండితులు" అనే అభిధానములు గల వారందరూ నిర్దుష్టమని ఐకమత్యముగా అంగీకరించదగిన గ్రంథము ఒకటీ నేటివారు వ్రాసినవాటిలో మాకు కనబడలేదు. ఒకరికి సాధువయినది మరిఒకరికి అసాధువు. ఎవరిమాట

ప్రమాణము ? ఇక, ప్రాచీనభాషలోని శబ్దములు తిన్నగా వాడలేకపోయినా, తెలియక తప్పు లనుకొని వాటిని దూషించినా ఎంత పండితుడైనా, గ్రాంథి కాంధ్రము రానివా డవుతాడు. ప్రాచీనులు వాడని ఉత్తరాంధ్ర శబ్దములు వాడిన వాడు కొత్త తెనుగు వ్రాసినవాడు కాకపోడు. ఉత్తరాంధ్ర కవుల గ్రంథము లలోని ప్రయోగములు కొన్ని తాము ప్రమాణముగా అంగీకరించి, తక్కినవి ప్రమాణము కాదనడము ఎవరికీ న్యాయము కాదుగదా. వృద్ధాచారము ప్రకా రము అభియోగము నడుపుతాము. పెద్దలు అనుమతింతురు గాక.

## అ భి వా ద న ము I

## బ్ర. శ్రీ. వేదము వేంకటరాయ శాస్త్రులవారు I. I.

3. వీరు తెలుగు పండితులలో అగ్రగణ్యులు. 'అభినవవాగను శాసను' లని, 'ఆంధ్ర మల్లినాథు'లని, 'శ్రీమన్ మహోపాధ్యాయు'లని వారి పాండి త్యమందభిమానముగలవారిచేత పొగడ్తగన్నవారు; చాలాకాలము కళాశాలా పండితులుగా ఉన్నవారు, అనేక గ్రంథములు రచించినవారు, శృంగార నైషధ మునకు సర్వంకష వ్యాఖ్య వ్రాసినవారు, లక్షణజ్ఞులు, విమర్శకులు, ఆంధ్రమే కాక సంస్కృతము ఇంగ్లీషు ఇంకను మరికొన్ని భాషలలో పాండిత్యము సంపాదించినవారు. ఇంతటివారి తెలుగుభాషలో తప్పొప్పులు నిరూపించడము నకు మావంటివాళ్ళు పూనుకోవడము అతి సాహసముగా కనబడునేమోకాని, నిర్భయముగా మా పూనిక నెరవేర్చుకొనేటందుకు తగిన ఉపాయములు, సాధ నములు, ఈ శాస్త్రులవారే మాకు సమకూర్చినారు. ఏలాగంటే:—

4. తమవలెనే కాలేజీ పండితులుగా ఉండి, తమవలెనే అనేక గ్రంథ ములు రచించి, తమవలెనే కవులని. విద్వాంసులని విఖ్యాతి పొందినవారి భాషలో అనేక దోషములు చూపిస్తూ వారి గ్రంథములు ఈ శాస్త్రులవారు విమర్శించి ఉన్నారు. అవి మేము చదువుకొన్నాము. ఇతరుల గ్రంథాలు దుష్ట ప్రబంధములని స్థాపించడమునకు వాటిలో ఏవి దోషములుగా నిరూపించి ఈ శాస్త్రులవారు నిరాకరించినారో, ఆ దోషములు ఈ శాస్త్రులవారి గ్రంథము లలో ఉన్నప్పుడు ఆవి వెదకి చూపించడము కష్టమయినపని కాదు. ఆ దోష ములనుబట్టి శాస్త్రులవారి గ్రంథాలు కూడా దుష్టప్రబంధములని సిద్ధాంతము చేయడము సాహస మెందు కవుతుంది ? అప్పుడు జంకు కళంకు లేని కవి చంద్రులమని విద్వద్వతంసులమని చెప్పుకొన్న శాస్త్రులవారు కూడా ఇతరులతో కలిసి ఏకరాశిలో చేరుతారు. వారి గ్రాంథికాంధ్రభాషా పాండిత్యము, కేవలము మిథ్యఅనిన్ని, పామరులను మోసవుచ్చుటకు పన్నిన

కైతవము అనిన్ని, తెలుసుకొని వివేకము కలవారు దాని కోసము దేవులాడరు, మృగతృష్ణలోని నీటికోసము వృథాశ్రమపడక సర్వజన సామాన్యమయిన జలాశయము చేరి దప్పి తీర్చుకొని సుఖిస్తారు.

5. ఈ శాస్త్రిలవారు 1898 సం. లో అద్భుతమైన గ్రంథ మొకటి రచించి ప్రకటించినారు. దాని పేరు "ఆంధ్రప్రసన్న రాఘవవిమర్శము". ఆంధ్రప్రసన్న రాఘవమనే గ్రంథము తెలుగు తర్జుమా. సంస్కృత ప్రసన్న రాఘవము తెలుగులోనికి తర్జుమాచేసినవారు కీర్తిశేషులయిన కొక్కొండ వేంకటరత్నముపంతులవారు; మహామహోపాధ్యాయులు. ఆంధ్రభాషా సంజీవనీ పత్రికాధిపతులు, నల్లభైయేండ్లు కాలేజీ తెలుగు పండితులుగానున్నవారు. అనేక గ్రంథములు రచించినవారు. తమవంటి పండితులు ఇంకొకరు లేరనిపించుకొన్నవారు, "సలక్షణమైన తెలుగుభాష" సుళువుగా వ్రాయడమేకాక, నిరాఘాటముగా మాట్లాడడము నేర్చినవారట నిత్య వ్యవహారములో ఇంటి వద్దనుకూడా "సలక్షణమైన తెలుగే" వాడుట ఆయనకు అలవాటట. "సలక్షణమైన తెలుగు భాష" కు ఆయన గ్రంథములే కాక ఆయన నోటిమాటలే ఆదర్శమట. లౌకికభాష గ్రామ్యమని (సంపంగిపువ్వును తుమ్మెదనిందించినట్టు) పంతులవారు పరిత్యజించినారట, నాటకములలోనయినా, అత్యధమ పాత్రల వాక్యములందైనా గ్రామ్యభాష వాడకూడదన్నారట. వేంకటరాయశాస్త్రిలవారి నాటకములో అట్టివాక్యములలో గ్రామ్యము ప్రయోగించడము దోషముగా పంతులవారిబుద్ధికి తోచినది. ఆకాలములో గ్రామ్యద్వేషులందరూ శాస్త్రిలవారిమీదికి దండెత్తివచ్చినప్పుడు, వారికి పంతులవారు కన్నాకుగానుండి శాస్త్రిలవారితోను వారిపక్షమువారితోను ఘోరయుద్ధము జరిపినారు. ఆరు సంవత్సరములక్రిందట సాహిత్యపరిషత్తువారు రాజమహేంద్రవరములో సమావిష్టులయి సభచేసినప్పుడు ఈపంతులవారు అధ్యక్షులుగానుండి మాబోంట్ల నందరినీ గ్రామ్యవాదులని నిందించి, బడులలోను, సభలలోను పండితులు కూడా "గ్రామ్యభాష" 'మాట్లాడటము మిక్కిలినింద్య'మని నొక్కి చెప్పి తమవలె సదాసలక్షణముగా అందరూ మాట్లాడడము నేర్చుకోవలెనని ఉపదేశించినారు.

6, ఇంతమట్టుకు వేంకటరత్నముపంతులవారిని ఎందుకు వర్ణించవలసి వచ్చినదంటే. సలక్షణభాషాభిమానమున్ను గ్రామ్యద్వేషమున్ను వీరియందు మూర్తీభవించినవి గదా; ఇట్టి పండితుల గ్రంథములో 2568 తప్పులున్నవట! వేంకటరాయశాస్త్రిలవారు వరసగా జాబితావ్రాసి అంకెలువేసి చూపించినారు. రెండుకోట్లమంది తెలుగువాచున్నారు. వేంకటరత్నముపంతులవారివంటి పండితులకే స్వాధీనముకాని "సలక్షణగ్రాంథికాంధ్రము" సర్వజనసామాన్యమయిన దేశభాష ఎప్పటికైనా కాగలదని ఆశపడుటకు అవకాశలేశమైనా

ఉన్నదా ? మాబోంట్లను గ్రామ్యులని తిట్టిన పంతులవారినే గ్రామ్యులను చేసినారు శాస్త్రిలవారు ! చూడండి, ఆంధ్రప్రసన్నరాఘవవిమర్శగ్రంథముయొక్క అవతారికలో విమర్శకులైన శాస్త్రిలవారు ఏమనివ్రాసినారో :—

'ఈ కాలమునలో ఆంధ్రభాషలో ప్రబంధములు పెచ్చుపెరుగుతున్నవిగదా. వానిలో అనేకములవలన భాషకు కడుంజెట్ట కలుగుచుండుటంగాంచి ఏదేనొకగ్రంథమాధారముగా నీచెఱుపునెల్ల విద్యార్థి జనోపయోగముకై. భాషారక్షకై వెల్లడిసేయఁ దలంపుగొన్న వాఁడనై అట్టి యిప్పటి గ్రంథములలో నెల్ల మ.రా.రాశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారు రచియించిన యాంధ్ర ప్రసన్నరాఘవము నా యుద్యమమున కత్యంతోపయుక్తముగా నున్నందున దానిని విమర్శింప దొరకొంటిని.... ఛందో వ్యాకరణాలంకారముల కిదివేరుపురువు.... రసము సున్న. పూర్వులుచెప్పిన పాకము లిందు లేవు. గ్రచ్చకాయ పాకము, మేడిపండుపాకము ముసిఁడి పండు పాకము దృష్టిపిడతపాకము....ఇత్యాదులు కలవు....అలంకార శాస్త్రమునఁ జెప్పిన దోషములలో ఇందు లేనిదిలేదు, అందు లేనివి ఇందెన్నియేని గలవు....సావధానముగాతత్త్వ మరయువారు వీరికిసంస్కృతము తెలియదనియు, దేవనాగరలిపి తెలియదనియు, నాటక లక్షణము తెలియనే తెలియదనియు, ఆంధ్రభాషకు వీరు విషము పెట్టినారనియు ఇతరుల గ్రంథముల గుణదోషములను చర్చించుటకు వీరు అధికారులు గారనియు, వీరి మతముచే భాష చెడుచున్నదనియు, గ్రహింతురు. అయినను సామాన్యముగా జనులు పరప్రత్యయనేయ బుద్ధులు, తెలిసినవారును పత్రికలయందు రాఁగల దూషణలకు భయపడియు, నిజస్తుతి యెనగొనియు, 'అష్టైతే మాభాగా యేదన్నమమ' మర్యాదగా ఆత్మాభిప్రాయములం బ్రకటింపరు. ఇందు వలన భాష చెడిపోదా ? కావున, ఇన్ని దోషములుగల దగుటచే ఈ గ్రంథము బుద్బుద ప్రాయముగా లయ మొందంగలదియైనను ఆంధ్ర భారతి కటాక్షము వడయు వాఁడనై, జయదేవకవికి ఈ తెలుంగు వలనం గలిగిన చెట్టందొలంచుటకై యీ విమర్శారంభముం జేసినాఁడ.'

8. శాస్త్రిలవారు వ్రాసిన విమర్శగ్రంథమంతా మొదటినుండి కొనవరకూ, 324 పుటలున్నూ చదివితేనేగాని ఈ అద్భుత విమర్శ స్వారస్యము తెలియదు. అయినా కొన్ని వాక్యములు ఉదాహరించి మచ్చు చూపిస్తాము. (ఆ వాక్యములు ఏ పుటలోనివో తెలియుటకు పుట సంఖ్య చేర్చినాము) పంతులవారి తెలుగు చక్కనిది కాదని విమర్శకులకు తోచినప్పుడు ఎంత సరసముగా దోషము నిరూపించి ఉద్ఘాటించినారో చూడండి:—

9. 'గోకంబద్దు తెలుగు' (69,79,80,105,120,122,149,276) గార్డెన్ టుకమ్ తర్జిమా (51) హాటెంటాట్ భాష (73, 80, 84, 131) అసంబద్ధ

ప్రలాపము (282) మదరాను తెలుఁగు (80) చెన్నపట్టణపుఁ దెనుఁగు (89) అఱవ తెలుఁగు (227) గుజరాతీపేట తెలుఁగు (218) అరబ్బీ మంత్ర పారాయణము (82) అసహ్యము (116) దగ్ధపటలము (281) రోత (301) తడగిడతోమ్ (142) చె_త్త (21) లొటలోట (251) చచ్చుడు (264) మునిసిపాలిటీవారిది (216) వేసిన అడుగెల్ల ఎంగిలాకులోనే పడవలయునా ? (249) ఇట్టి చేతకాని కవన మెవరు చెప్పుకొమ్మన్నారు (314) వాణికి ఓకలింత (12) వీధిలో పారవేయవలసినది (15) బెంకాయ పిచ్చికొండ (7,110,182) అర్ధమేడ్చినట్లున్నది (97,304) ఏమి యీ చేయంగల విన్నపముల కవనము (162) పంతుల వారు స్వారస్య వినాశన ధ్వజ ప్రతిష్ఠాపనాచార్యులుగారు (105) రక్షణ నిర్వాహము పీఁచు రేఁగుచున్నది (111) ఎవ్వరికేనిచూపుకొని యుండరాదా (122) విద్యార్థులతోఁ కలిసి చదువరాదా (171) కవితా త_త్త్వవిత్ప్రికాండకుల మని ప్రగల్భింతురు. అజ్ఞులును నమ్మెదురు గతాను గతికులు ఘోషింతురు (16) ఏం శేతూ నేం శేతూనే అని యేడ్చినట్లున్నది (70) నన్నుఁ బెండ్లాడవే చెంచీత నీకు బహుపున్నె ముంటదే చెంచీత అని చెచీంతపాట సరణిం బురణించుచున్నది. (253) ఆంధ్రభాషావధూటిని కడు పార విషము త్రాగించి సంజీవనము వేయుటగాదా ? (164) మున్ను తిక్కన శ్రీనాథులు ఆంధ్రీకరించిరి. ఇప్పుడు ఇట్టియ నేడమూకులు తొడఁగినారు అందును వీరివలె పాడుచేసినవారు మఱి లేరు, వీరు పండితులట ! తెలివిగలవారట ! ని_స్తర పాదపే దేశే హేరండోపి ద్రుమాయతే (323).

శాస్త్రిలవారూ ! న్యాయమా యింత పరుషముగా పంతుల వారిని తిట్టడము !

ఈలాగున ఒకరి నొకరు దూషించడము పండితులకు చెల్లునుకాబోలు. అది అట్లుండనీయండి. భాష ఒక్క_టే మా వ్యాసమునకు విషయము గనుక అలంకారాలు, రసాలు, పాకాలు, యతులు, ప్రాసములు మొదలయిన వాటి విమర్శనముతో గాని, తిట్లతో గాని, మాకు ఇక్క_డ పని లేదు. ఆంధ్ర వ్యాకరణ మర్యాదాతిక్రమణములు ఇంచుమించుగా ఇరవై అయిదు పంతులవారి గ్రంథములో శాస్త్రిలవారు చూపించినారు. వీటిలో రెండుమూడుతప్ప తక్కి_నవి రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతుల వారి నాటకములో ప్రయు_క్తము లయినవనిన్ని ఆపంతులవారువ్రాసిన "దుష్ట ప్రబంధముల" విషము ఆంధ్రభారతి దేహమునకెక్కి_ ఆమెను 'ప్రాణసంశయ దశకు' తెచ్చినదనిన్ని శాస్త్రిలవారు మరియొక విమర్శలో వ్రాసినారు. ఆవిమర్శనము ఈవ్యాసము రెండవభాగములో విమర్శించినప్పుడు వేంకటరత్నము పంతులవారి 'తప్పులు' అచ్చట పేర్కొ_ని చర్చించి ఇద్దరు పంతులవార్లున్ను

పొరబడ్డారో లేక శాస్త్రిలవారే తప్పొప్పులు కనుక్కోలేక పొరబడ్డారో, విచారిస్తాము. వేంకటరత్నముపంతులువారి తెలుగులో మహాపాతకముతో సమానమైనట్టిదని శాస్త్రిలవారికి తోచిన గొప్ప దోషము ఒకటి ముందుగా వివరించి, శాస్త్రిలవారి ఆంధ్రభాషాపాండిత్యవైశిష్ట్యము ప్రకటిస్తాము.

11. ఆంధ్రప్రసన్నరాఘవము. ప్రథమాంకము 11-వ పుటలో కవిగారు 'పంపలేడయ్యెడుఁ' అని ప్రయోగించినారు. ఈశబ్దము తప్పనుకొని శాస్త్రిలవారు విమర్శనములో ఏమి వ్రాసినారంటే—

12. 'పంతులవారి నలువదియేండ్ల యాంధ్రవ్యాకరణోపాధ్యాయతా ప్రభావము. అయ్యెడున్—ఇదేమి జ్యోస్యమా? లూట్టా? లాట్టా? 'ఆశీశ్శాప సంప్రార్థనవిధులందు లూట్టగు' బాల, క్రియా. ౽. ఈయర్థములం దొకటియు నిటం బొసంగదు. 'తద్ధర్మాదులందు లాట్టగు' బాల. క్రియా. ౽ 'తచ్ఛీలసంభావనా సంప్రశ్నసాతత్య వర్తమాన భావ్యాశీరాదులు లాది పదగ్రాహంబులు' ఈయర్థములందును భావివక్తకు తెలియునదిగాదు, వర్తమానేతరములు పొసంగవు. వర్తమాన మర్థమేని, ఏఁడును ఏమి అయ్యెడున్? ఏమగుటయుంగాదు, అయ్యెడున్ అనునది వ్యతిరేకార్థమునకు అనుప్రయుక్తము అని యుత్తరమేని, ఈసూత్రంబుం గనుండు. భూతంబున లఙ్లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తంబగు' బాల. క్రియా. ౧౧౪. దీన నెఱుంగుడు లిడంతమేగాని, అన్యమనుప్రయుక్తంబుగాదని. కావున, నిది పాదముముగియుటకు ఏదోఒకడున్న. దీనిపేరు అయ్యెడున్న.'

13. ఆగ్రంథమందే వేంకటరత్నముపంతులవారు ప్రథమాంకము 16-వ పుటలో మంజీరకునివాక్యములో 'ఎక్కడఁ బడిదయ్యెడు' అని మరి ఒకమారు అట్టిరూపము ప్రయోగము చేసినారు, శాస్త్రిలవారును మరిఒకమారు తమలక్షణజ్ఞత వారి లక్షణాజ్ఞత ఉద్ఘోషించి విమర్శనము వ్రాసినారు. అజ్ఞానవిజృంభితము.

14. 'భూతంబున లఙికి లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తంబగు బాల. క్రియా. ౧౧౪. వాఁడు రాఁడయ్యెను. మేము రామయితిమి—అని యుదాహరణము. ఏతత్సూత్రరీతిని వ్యతిరేకమునకు భూతమున అగుధాతువు భూతార్థము అనుప్రయుక్తమగును గాని లాడాదికములు కానేరవు. ఎక్కడఁ బడ దయ్యెడునట! నలువదియేండ్ల యాంధ్రపండితుల యాంధ్రవ్యాకరణ జ్ఞానము ఎట్లు రేఁగుచున్నదో యరయుఁడు. ఇది రెండవమారు వీరీతప్పు చేయుట. ౧౧-వ పుటలో 'లేడయ్యెడున్' అని తొలిమా అయినది, వీరే క్రొత్త వ్యాకరణము చేయవలసినవారు.

15. చూచినారా ! శాస్త్రులవారికి ఎంత విశ్వాసమో చిన్నయ సూరి బాలవ్యాకరణ శాస్త్రమందు ! పండితులు శాస్త్ర దృష్టిగలవారట గదా ! చర్మ చక్షుస్సుకుకనబడేది నమ్మరు ! శాస్త్రము అమోఘము ; గనుక ప్రమాణము. చిన్నయ సూత్రరీతిని అగు ధాతువు భూతార్థమందే గాని వర్తమాన భవిష్యదర్థమునందు అనుప్రయుక్తము కాదని చెప్పి ఊరకుండక, పంతులవారిని ఎట్లు దూషించినారో విమర్శకులు ! అదేమో కారణముతెలియదు గాని, పంతులవారు ఆంధ్ర వ్యాకరణము ఒకటి చేయడమునకు యత్నించినట్లు. ఆయన అట్టి పనికి తగినవారు కానట్లు శాస్త్రులవారు తలంచి, సందు దొరికి నప్పుడెల్లా ఇట్లే చెప్పినారు. విమర్శగ్రంథము 55-వ పుటలో :—

'ఏండ్ల తరబడి యాంధ్రోపాధ్యాయులట ! కవితాతత్వ విత్తట ; ఆంధ్ర వ్యాకరణ పాండిత్య మిట్లున్నది ! ఈ పాండిత్యముతో ఆంధ్రభాషా సంజీవకులట ! కాల మహిమ !' అనిన్ని 80 వ పుటలో 'నలువదియేండ్లనుండి ఆంధ్ర వ్యాకరణము పాఠము చెప్పుదురట ! ఏదో నూతన వ్యాకరణము చేయుడు' అనిన్ని 113 వ పుటలో 'తద్ధర్మార్థక విశేషణమునకు హల్లు పరమగునప్పుడు నుగాగమ మెచట విహితము ? క్రొత్త వ్యాకరణము త్వరగాచేసి వేయుదము. ఆజ్ఞ పుచ్చుకొని యున్నారము గదా !' అనిన్ని. 313 వ పుటలో 'ఈ కాలమున వీరు నొక—కాదు, వీరొక కాదు. వీరే ఆంధ్ర భాషా మర్యాదా వ్యవస్థాపకులు !' అనిన్ని తరచుగా దూషించినారు.

16. శాస్త్రులవారు ఈ విమర్శము వ్రాసిన సంవత్సరము 1898. 15 సంవత్సరములు గడచిన తర్వాత శృంగార నైషధమునకు సర్వంకషవ్యాఖ్య వ్రాసినారు. నైషధము 7 వ ఆశ్వాసము 72 వ పద్యములో 'చేయ రయ్యెదరు' అనిన్ని, 8 వ ఆశ్వాసము 185 ప పద్యములో 'లేఁడయ్యెడున్' అనిన్ని శ్రీనాథుడే ప్రయోగించినాడు. వేంకటరత్నము పంతులవారిని ఇట్టి శబ్దములు వాడినందుకు అంతగా దూషించిన శాస్త్రులవారు శ్రీనాథుని ప్రయోగములను గురించి ఏమని వ్యాఖ్యానములో వ్రాసినారంటే:—

'చేయరయ్యెదరు' బాల క్రి. 114 లో లజికి (=వ్యతిరేకార్థమునకు) అగుధాత్వను ప్రయోగమును భూతంబున మాత్రము చెప్పుట తదను ప్రయోగ వైరళ్యమును తెలుపుటకని కొందఱ మతము 'లేఁడయ్యెడున్' బాల క్రి. 114 వలన 'లేఁడయ్యెన్' అను ప్రయోగము సిద్ధించును. ఈ ప్రయోగమునకు గతిమృగ్యము. 'లేఁడయ్యెఁజూ' అని (లేఁడయ్యెఁబో, అని యేని) మార్చిన సరిపడును. 'చేయరయ్యెదరు' ఆ 7-72 ఇత్యాది ప్రయోగములంబట్టి బాలవ్యా.లో 'భూతంబున....లిడంతంబు' అనుట ప్రాయోవాదమని తలంపవలయును.'

17. 1898 వ సం. లో ఆంధ్ర ప్రసన్న రాఘవము విమర్శించి నప్పుడు చూపిన అహంకారము, ఆటోపము, అప్పుడు చేసిన సింహనాదము, హాస్యము, అట్టహాసము - ఇవి అన్నీ 1913 వ సం. లో శాస్త్రిలవారు నైషధమునకు వ్యాఖ్య వ్రాస్తూ ఉన్నప్పుడు అజ్ఞాన విజృంభితములని అంతఃకరణమునందు తోచి ఉండును. లేదా, చిన్నయసూరిగారి వ్యాకరణ శాస్త్రము శ్రీనాథుడు చదువుకోలేదన్న కారణముచేత, అతని శాస్త్ర మర్యాదను అతిక్రమించిన దోషము నకుగాను, వేంకటరత్నము పంతుల వారిని దూషించినట్టు దూషించక కనికరించి విడిచిపెట్టినారేమో !

18. 'లేఁడయ్యెడున్' అని శ్రీనాథుడు ప్రయోగించిన శబ్దము తాటాకు పుస్తకాలలోనూ, అచ్చుపడ్డ పుస్తకాలలోనూ, తమ కంటికి కనబడుతూ ఉండగా, 'లేఁడయ్యెఁజూ' 'లేడయ్యెఁబో' అని మార్చితే సరిపడును, అని దిద్దడానికి సాహసిస్తారు, శాస్త్రిలవారు ! ఈ రూపములు నన్నయ తిక్కన మొదలయిన పూర్వకవులు వాడినవే అని ఎరుగరు. తమ కిష్టముగాని శబ్దములు ప్రాచీన గ్రంథములలో కనబడితే, దిద్ది మరి కనబడకుండా తీసివేసి, పరిష్కరించి అచ్చువేయించే పండితులలో ఈ శాస్త్రిలవారు అగ్రగణ్యులు. వీరు పరిష్కరించిన పద్యాలు రచించిన కవులు ఇప్పుడు చూడడము సంభవమైతే తాము రచించినవి పోల్చుకోలేనట్టు అవి మారిపోయినవి.

19. అథర్వణుడు, అహోబలుడు, అప్పకవి మొదలయిన లాక్షణికులు శ్రీనాథాదుల ప్రయోగములు తప్పులని నిరాకరించినారు కారా ? అలాగుననే చిన్నయ సూరిగారున్ను వేంకటరాయ శాస్త్రిలవారున్ను, లాక్షణికులు గనుక, 'లేఁడయ్యెడున్' వంటి ప్రయోగములు తప్పులని దూషించినారు—అని ఎవరైనా వాదిస్తే, అందుకు మా జవాబు తరుచుగా ఇదివరకే చెప్పి ఉన్నాము; అయినా, తిరిగీ చెప్పుతున్నాము. చిన్నయసూరిగారికి పూర్వమందు ఏ లాక్షణికుడూ ఈ రూపము తప్పని చెప్పనప్పుడు, ఈయన తప్పనడానికి ప్రమాణమేమిటి ? నేటి లౌకికభాషలో ఈ రూపము లేదు గనుక గ్రామ్యమని నిరాకరించినారని చెప్ప వల్ల కాదుగదా. ఇకను ఒక్కటే వికల్పమున్నది. వీరికి ప్రాచీన గ్రంథములలో ఈరూపములు కనబడలేదు అని చెప్పవలెను. తమకు కనబడనిశబ్దము తప్పని చెప్పేవారు అన్ని గ్రంథములూ ఆమూలాగ్రము జాగ్రత్తతో పరీక్షించినవారయి ఉండవలెను. అంతటి ఆంధ్ర భాషా పాండిత్యము చిన్నయసూరిగారికి గాని, వేంకట రాయశాస్త్రిలవారికి గానీ లేదని మేము ఋజువుచేయగలము. అథర్వణుని కారిక ప్రమాణముగా గ్రహించి అహోబలుడు శ్రీనాథుని 'పసిగొంట' అనే ప్రయోగము తప్పని దూషించడము, ఆ యిద్దరి లాక్షణికుల అవిమృశ్యకారిత్వమని తిక్కనాది

మహాకవుల ప్రయోగములు అనేకములు ఉదాహరించి సిద్ధాంతము చేసివున్నాము. (చూ. బాలకవి శరణ్యము) అట్లే, నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు రచించిన భారతములోనున్న ప్రయోగములు ఉదాహరించి, చిన్నయ సూరిగారున్ను వారిశాస్త్రమును వేదవాక్యముగా విశ్వసించిన వేంకటరాయశాస్త్రిలవారున్ను భారతము లెస్సగా చదువక, భారతములో ఉన్న ప్రాచీనాంధ్రభాషా శబ్దములే తప్పులని నిరాకరించుటకు సాహసించినారని సిద్ధాంతము చేయగలము. 'కొంట' మొదలయిన రూపములు తప్పన్న అధర్వణుని లక్షణమున్ను అహోబలుని లక్షణమున్ను పాడయినట్టే, వీరి లక్షణముకూడా పాడు లక్షణము కాక తీరదు.

20. ఇక ప్రయోగములు చూడండి : ఆది, అరణ్య, విరాట, స్త్రీ, అనుశాసనిక, అశ్వమేధ, మహాప్రస్థాన, స్వర్గారోహణ పర్వములలోనివి మాకు జ్ఞాపకమున్నవి, ఇంచుమించుగా ఇరవై ఉదాహరిస్తున్నాము. ఇంకను ఎన్నో భారతములోనే ఉన్నవి. ఇతర కవులుకూడా ఇవి వాడిఉన్నారు.

1. చ....యీలలితాంగి యందునా। హృదయము దద్దయుండవిలె
నిప్పులు కింకను నమ్మనేరన। య్యెద ఆది IV. 29

2. చ. అవని యరాజకంబయినయప్పుడ భూప్రజయందసర్వధ।
ర్మములుఁదొలఁగు....వృష్టిలే। దవు.... ఆది. IV 250.

3. చ....యు। త్యలఘు పరాక్రమాన్వితు మహాభుజునర్జును దివ్యసాయకం।
బులుపడయంగ నొక్కరున పుచ్చితిఁ దద్దయు వేడ్క నెద్దియుం।
దలపన యెప్డు తద్విరహితమ్మగు కామ్యక మొప్పదయ్యెడిన్.
అర. II. 290.

4. తే. సహజములు నాకు నిక్కవచంబుఁగుండ
లములు నివి లేక యున్న నే సమరభూమిఁ
గడిది శత్రులచేత భంగంబు పడుదుఁ
గాన-యీఁజాలనయ్యెద వీనినేను. అర. VII. 204.

5. చ. నినునొక యక్షమాత్రుఁడుగ నేమది నమ్మఁగ నేరనయ్యెడన్...
అర VIII .460

6. ఉ. చిత్తము మెచ్చినావలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగియ
చ్చొత్తినయట్ల నాకుఁ దనయుల్లము దెల్లముసేయకున్కి దా
నత్తరిఁ గ్రొత్తకా న్పగుట నడ్డము సొచ్చిన సిగ్గు పెంపున
న్నుత్తలమందఁ జేయుటకునో తలపోసియెఱుంగనయ్యెదన్.
విరా. II. 84.

(ఆనందముద్రణములో 'ఎరుంగనయ్యెడు'. వ్రాతప్రతులలో 'నయ్యె
డన్' 'సాధువు'....)

7. క. ఈనరపతి యాస్థానములో నొక్కరుఁడైన ధర్మలోప భయమునం
బూని తగువైన వెడ పలుకైనను బలుకంగఁ జాలఁడయ్యెడు నకటా
విరా. II. 141.

8. క. మొగ మొప్పదు నా వెస నీ జగతీ నాథునకు నే విచారించియునుం
దగ దీనికిఁ గారణమిది యగునని యేర్పఱుపనేర నయ్యెదనెట్లున్.
V. 306.

9. ఉ. ఇమ్మెయిఁ బాలుఁడొక్కరుఁడ యిందఱఁదోలి వధించెనన్న నేనమ్మఁగ
నేరనయ్యెడ.... ద్రోణ. II. 86.

10. సీ. గీ....గెల్వ గెల్వఁగ మదీయ,
బుద్ధి గైకొనదయ్యెడు సిద్ధముఖ్య. శాంతి. I. 6.

11. చ.................................భీతినూ,
నినమది తోఁడ నమ్మమిని నెట్టన యియ్యెరిఁ ద్రెంపనయ్యెదన్.
శాంతి. III. 213.

12. తే. సారచందన హృద్యకస్తూరికాది
లేపనాలిప్తి నుండెడు భూపపర్య
లకట శోణిత పంకదిగ్ధాంగులగుటఁ
గనుట కోర్వ రాదయ్యెడుఁ గమలనాభ. స్త్రీ. II. 16.

13. తే. అవయవములు రూపఱఁగ గ్రవ్యాదభక్షి
తంబులై యున్కిఁ గొన్ని శవంబు లువిద
లెంత సూచియునవి గొందఱెఱుఁగఁ జాల
రయ్యెదరు సూడు తమ బంధులగుటఁ గృష్ణ. స్త్రీ II. 23.

14. వ.ఇది యన్యాయ్యంబని యలుగనుఁదగవు వలుకనుఁ దేఱి చూడను
రాదయ్యెడు అనుశా. 311.

15. చ....యాహవమున కొల్లనయ్యెదఁ
బ్రియంబెలుగాఁ బోకొమ్మాకుఁ బ్రాణముల్. అశ్వ IV 7.

16. చ....ద్రౌపది భీమసేను న,
ర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రతచాలితి చాలవయ్యెదీ,
శునకము విడ్వ........ మహాప్రస్థా. 56

17. చ. అనవిని ధర్మరాజసుతుఁ డాతని కిట్లను నాదు తమ్ములం
గనుఁ గొనునంతకున్ సుఖముగాఁ గొనవయ్యెద నిత్తెఱంగు. మహాప్రస్థా 70

18. వ. సోదరరహితస్వర్గంబునందు స్వర్గత్వబుద్ధి పుట్టదయ్యెడు స్వర్గా. 15

19. సీ. పా. విభ్రాంతిఁ జేసి వివేకింప నేరరాదయ్యెడునని స్వర్గా. 27.

21. భారతమందే, అనేక పర్వములలో కనబడుతూ ఇన్ని ప్రయోగములుండగా, 'ప్రయోగ వైరళ్య'మని ఈ శబ్దములు ఏ లాక్షణికుడైనా ఉపేక్షించునా? చిన్నయసూరికి శృంగార నైషధములోని ప్రయోగములు గాని, భారతములోని ప్రయోగములలో ఏదైనాగాని తెలిసి, జ్ఞప్తియందుంచి ఉంటే, లజికిలిడంతంబగు నగు ధాతువేకాక, తది తరాంతంబగు నగు ధాతువుకూడా అనుప్రయుక్తంబగునని లక్షణము చెప్పి ఉండును. ఆయన పరిష్కరించి అచ్చువేయించిన ఆది పర్వములోనే ఉన్నవి ఇట్టి ప్రయోగాలు. కాబట్టి ఈ ప్రయోగము ఆయన కంట బడినా చూడలేదనిగాని. చూచినా, గురియందు ఉంచుకోలేదనిగాని, మన మూహించవలెను. అయితే. ఈ చిన్నయ సూరిని ఇందుకై ఎవరున్ను నిందించగూడదు. తాను చెప్పిన విషయములు తప్పులనక కవుల ప్రయోగములనుబట్టి తెలుసుకోవలసినదని మొట్ట మొదటనే వ్రాసినాడు. గనుక మేము వేదము వేంకటరాయ శాస్త్రులవారి యందే దోషము ఆరోపిస్తున్నాము. చిన్నయసూరి నాటికి భారతమంతా అచ్చుపడలేదు. శాస్త్రులవారు అచ్చుపడ్డ భారతములోని శబ్ద రూపములు కొన్ని విమర్శించి అముద్రిత గ్రంథ చింతామణిలో వ్యాసములు వ్రాసి ఉన్నారు. తాము గుర్తు పెట్టుకొని ఉన్నవి ఏవో కొన్ని శబ్దములు తప్ప తక్కినవి తిన్నగా చూడలేదుగాబోలు. ఏది ఎట్లయినా ఆంధ్రప్రసన్న రాఘవము విమర్శించి నప్పుడు, (12వ, 14వ పేరాలలో మేము ఉదాహరించిన ఆయన వాక్యములను బట్టి) నైషధములోని ప్రయోగములుగాని భారతములోని ప్రయోగములుగాని ఆయన ఎరుగరని నిస్సంశయముగా మనము చెప్పగలము. తమకు తెలియని శబ్దము ప్రాచీనాంధ్రములో ఉండనే ఉండదనుకొన్నారో; ఉండనే కూడదను కొన్నారో; తమకు తృప్తిగా తమ అంతఃకరణమందు ఏమనుకొన్నా అనుకో వచ్చును గాని. తమసాటి పండితులయిన వేంకటరత్నముపంతులవారు వాడిన సాధు శబ్దము తమ అజ్ఞానము చేత అసాధు శబ్దమనుకొని, 'పంతులవారి నలువది యేడ్ల యాంధ్రవ్యాకరణోపాధ్యాయతా ప్రభావము; అయ్యెడిన్—— ఇదేమి జోన్యమా? లూట్టా? లాట్టా? నలువదియేండ్ల యాంధ్ర పండితుల యాంధ్రవ్యాకరణ జ్ఞానము ఎట్లు రేఁగుచున్నదో యరయుఁడు వీరే క్రొత్త వ్యాకరణము చేయవలసినవాడు'; అని కొంతకొసరు లేకుండా పడతిట్టినారే; ఈలాగుని తిట్టడానికి వివేక గలవారెవరైనా సాహసింతురా? ఇదంతా

తమ అజ్ఞాన విజృంభణమని తెలుసుకోలేక పోయిరిగదా ! 'జోస్యమా ?' అని హాస్యానికి అడుగుతారు ! 'లూట్టా? లాట్టా?' అని అట్టహాసాలు చేస్తారు ! దెయ్యాలను పారదోలడమునకు, పామరులను బెదరించడమునకు, మాంత్రికులుచదివే మారణమంత్రాల లాగున ఏమిటి ఈబాల బిభీషికలూట్, లాట్ ? హ్రాం ! హ్రీం ; హ్రూం! ఫట్; హూత్! హాత్ ? ఈ శాస్త్రిలవారి పాండిత్యములోటుగానిలాటీ కాదు, లూటీ కాదు పోటీకి వ్రాసివుంటారు 'ప్రాయః సమాన విద్యాః, పరస్పర యశః పురోభాగాః' అని కాళిదాసు చెప్పినట్టు, వేంకటరత్నము పంతులవారిని ఈలాగు అన్యాయముగా, నిష్కారణముగా దూషించడము ఈర్ష్యచేతనని ఊహించవచ్చును. ఈర్ష్యాంధులు ఏదో ఒక కూపములో పడడము ఆశ్చర్యముకాదు. ఇట్టివారిమాటలు వేదవాక్యాలని నమ్మి, వారి వెంట వెళ్ళినవారు 'అంధువునఁబడు నంధాను గాంధుని' వంటి వారవుదురా కారా ? ఇకనైనా ఎకసక్కెము లాడక వివేకముగలిగి తెలుసుకొందురుగాక! "లేడయ్యెడుఁ" అనేది పరాచకముకాదు. వాగనుశాసనుని ప్రయోగమంత్రము! కవిబ్రహ్మప్రయోగమంత్రము! ప్రబంధ పరమేశ్వరుని ప్రయోగ మంత్రము! మంత్రార్థము తెలుసుకొని యథావిధి పురశ్చరణచేస్తే, శాస్త్రిలవారిని పట్టుకొని పీడించి మతిపోగొట్టి అసంబద్ధ ప్రలాపంబులాడించిన వైయాకరణ పిశాచము వదిలి పారిపోతుంది, తర్వాత పశ్చాత్తాపము నొంది ఆత్మ దోషము నుద్ఘోషించి ప్రాయశ్చిత్తము చేసుకొంటే మిథ్యాపవాద పరిహారమవుతుంది. నిర్దుష్టమైన శబ్దమును దుష్టమని నిందించి దిద్దిన మహాపాతకమునకు నిష్కృతి ఏలాగున కలుగుతుందో మేము చెప్పలేము. పతివ్రతను బంధకి అనిప్రకటించి దాని మనువు కూలదోసిన పాపమునకు నిష్కృతి ఉంటే దీనికీ ఉంటుంది. అది అలాగుండనీయండి.

22. నేరనయ్యెదను ; నేరనయితిని—ఇట్టిరూపములు ప్రాచీనాంధ్రములో కాలభేదము స్పష్టముగా బోధించడమునకు వాడినట్టు మనము తెలుసుకోగలము. త్రిలింగలక్షణ శేషమందు క్రియా పరిచ్ఛేదమున 8వ సూత్రములో చెప్పినట్టు, వ్యతిరేక క్రియ వర్తమాన భూత భవిష్య దర్థములను మూడింటిని బోధిస్తుంది. ఆసూత్రము క్రింద ఉదాహరించిన ప్రయోగములన్నీ భారతము లోనివి కావు భూతమునకు 'నలుగాన మిన్వనంబున' అనే అరణ్య పర్వములోని ప్రయోగము ఒక్కటే ఉన్నది. ఆ భారత ప్రయోగాలు వేంకటరాయ శాస్త్రిలవారు మన్నించరేమో అనిన్ని, ఉదాహరించిన ప్రయోగములో నున్న 'కానము' అనేదానికి వేరే అర్థము చెప్పవచ్చునంటారేమో అనిన్ని, భారతములోనివే సందేహమునకు ఎడ మివ్వని ప్రయోగములు మూడు చూపిస్తున్నాము, ఇట్టివి అనేక మున్నవి.

1 ఉ. సంపద దక్కియుండఁగ నశక్తులనం జనుమమ్ముఁబిల్చి పూ
జింపఁగ నంత జేలె పతి నెప్పెకు వారల బుద్ధి నాఁడ
మన్నింపడ యింక నేల. ఉద్యో 1. 314.

2 క. వారు దెసలొత్తికొనియు ధరా రాజ్యంబిచ్చి పోయిరా పోరా తా
రా రణ్య పీడఁబడియును రారాజుం జెఱకుఁ బాపరా మన మెఱుఁగన్
I. 2041.

3 క. ఇది మున్న యేను ద్రోణుఁడు విదురుండును
జెప్పిన యదియ వినవప్పుడు భీష్మ III 79.

మొదటి పద్యములో 'మన్నింపడ' అంటే మన్నించినాడుకాడు, అనిన్ని, రెండవదానిలో 'పోరా', 'పాపరా' అంటే 'పోయినారు కారా 'పాపినారుకారా', అనిన్ని, మూడవదానిలో 'వినవ' అంటే 'విన్నావు కావు' అనిన్ని అర్థము. అట్టి అర్థము స్పష్టగా చెప్పవలసినప్పుడు వర్తమాన కాలమునకు 'మన్నింపఁడయ్యెడున్' 'పోరయ్యెదరు' 'పాప రయ్యెదరు', 'వినవయ్యెదవు' అనే రూపము లుంటవి. వీటికి ఇప్పటి తెలుగులో 'మన్నించకుండా ఉన్నాడు', 'పోకుండా ఉన్నారు!' 'వినకుండా ఉన్నావు' అని ఉంటవి. ప్రాచీన భాషలో 'లేదయ్యెడున్' వర్తమానకాలము; లేదయ్యెన్ భూత, లేదగున్. భవిష్యత్. ప్రాచీనాంధ్రభాషాలక్షణము సంపూర్ణముగా ఎవరూ తెలుసుకోలేరు; తెలుసుకొనుట అసాధ్యమే. గ్రంథాలలో కొంత వ్యత్యస్తమై ఉన్నంతమట్టుకైనా నేటివరకూ ఎవరు సంపూర్ణముగా తెలుసుకోలేదు అని శాస్త్రిలవారి విమర్శములో ప్రకటితమయిన అవిమృశ్యకారిత్వమే దాఖలా. పెద్దపేరు పెట్టుకొన్న ఆంధ్ర పండితులకే ప్రాచీనాంధ్ర భాషాజ్ఞానము చాలనప్పుడు కేవల గ్రాంథికమయి ఉన్న ప్రాచీనాంధ్రభాష దేశభాషగా నెంచి, వాడుకలో ఉన్న వాస్తవమయిన నేటి దేశ భాషగ్రామ్యమని నిరాకరించడము అవివేకముకాదా? ఆంధ్ర భాష గ్రాంథికమయి ఇంచుమించుగా వేయివత్సరము లయినా, ఆంధ్ర గ్రంథములు ఆంధ్ర పండితులు యావజ్జీవము చదువుతూ ఉన్నా, ఆశుకవిత్వము చెప్పనేర్చినా, సభలో రెండు గడియలు ఈ 'గ్రాంధికభాష' లో దేశ వ్యవహారమును గురించి ఉపన్యసించలేరే! ఇట్టి భాష సర్వజన సామాన్యమయిన దేశ భాషగా ఎన్నటికైనా కాగలదా? సర్వజన సామాన్యమైన దేశభాష ఉండవద్దా? దేశహితమును కోరేవారు లెస్సగా ఆలోచింతురుగాక.

23, వేంకటరాయ శాస్త్రిలవారు స్వయముగా ఆంధ్ర గ్రంథాలు చదువుకొని భాషా లక్షణము తెలుసుకోక, ఇతరులు చెప్పిన లక్షణము ప్రమాణముగా గ్రహించి, సాటి పండితులను దూషించినా రనుటకు మరియొక విషయ

మును ఉదాహరిస్తున్నాము. వేంకటరత్నము పంతులవారి ఆంధ్ర ప్రసన్న రాఘవమునందు 5 వ పుటలో

చ. గొనబగు వాణి యెవ్వరికిఁ గోమల కన్యకలా కలాప యా
ఘనులకు డిందునే యరయఁ గర్కశ తర్కవచో విజృంభణ
స్ననువుగ గోకులుంచఁ బడు నన్నుల చన్నుల నేరి చేతనె
న్నను మదకుంభి కుంభదళనమ్మున నమ్ములు పోవె వారిచేన్.

24. ఈ పద్యమందున్న 'చన్నులు' అనే శబ్దమును గురించి శాస్త్రిలవారు విమర్శములో ఏమని వ్రాసినారో చూడండి:—

'చన్నులు—ఈ పద్యము వైద్య శాస్త్రోచితముగా నున్నది—'

సీ. మదిరాక్షి చెవులులొప్పి చి లెక్కలనరాదు। ముద్దియకనులు తమ్ములనరాదు
శుకవాణి బుగ్గలు ముకురంబు లనరాదు। చెలిపండ్లు మల్లెమొగ్గ లనరాదు
గజయానచండ్లు బంగరు గిండులనరాదు। సతిబొడ్డు సుడిని మెచ్చదనరాదు
సరసిజానన ముడ్డి సైకతం బనరాదు। హరిమధ్య కాళ్ళుగుళ్ళనఁగరాదు.

తే. క్రమత వీనికి వీనులు, కన్నుదోయి,
చెక్కులును, బలువరుసయు, నిక్కఁజన్నుఁ
గవయుఁ, బొక్కిలి, పిరుదు, చొక్కంపుటడుగు,
లనుచు మును వాడిరవియ చేకొనగఁవలయు.

అని యప్పకవి చెప్పు హితమును వినఁదగును. చన్నులని కొందరు కవులు ప్రయోగించి యుందురని పంతులువారు ప్రయోగములు చూపుదురు గాఁబోలు। కలవుగాని స్థలవైభవముచే వాని గ్రాహ్యతయుం గలుగునొండె. 'అనువుగ గోకులుంచఁబడు నన్నుల చన్నుల నేరిచేత'—ఇది యెట్లుధ్వనించుచున్నదనఁగా— మెడికల్‌కాలేజిలోని యే విద్యార్థులు స్తన స్వరూప పరీక్షార్థమై చచ్చిన యన్ను శవముల స్తనములను కోసి తెచ్చి యొక బల్లమీఁద నుంచుకొని వానిని ఉపాయముగా తమ గోళ్ళతో పట్టి పరిశోధింతురో ఆ విద్యార్థులు—అని, ఇందలి పదమహిమ యట్టిది.

25. అచ్చుపడ్డ అప్పకవీయములో మీద నుదాహరించిన సీసపద్యమందు మొదటి పాదములో 'కనులు' అని ఉన్నదిగాని తాటాకు పుస్తకాలలో (మేము పదహారు ప్రతులు చూచినాము) 'కండ్లు' ('కంళ్లు', 'కళ్ళు') అని ఉన్నది. చక్కని స్త్రీని వర్ణించినప్పుడు, చెవులు, కండ్లు, బుగ్గలు, పండ్లు, చండ్లు, బొడ్డు, ముడ్డి, కాళ్ళు అనే శబ్దములు ఉచితమయినవి కావనిన్ని, వాటికి బదులుగా వీనులు, కనులు, చెక్కులు, పలువరుస, చనులు, పొక్కిలి, పిఱుఁదు, **అడుగులు అనేవి వాడవలె ననిన్ని ఉపదేశించి,**

తే. రణమువర్ణించుచో వీరరసమునందు, యుద్ధపంచకమునఁదిక్కయొజ్జసారెఁ
గాళ్లటంచురచించుటగాంచి కవులు,చెప్పుకొనిరిమీఁగాళ్ళనిచెలఁగికృతుల.

అనిచెప్పి, సారంగధరచరిత్రలో కవి 'మీఁగాళ్ళ' అని స్త్రీ వర్ణనలో వాడినాడని ప్రయోగమిచ్చి ఊరకున్నాడు. అయితే అప్పకవి అనుశాసన మేమిటి? 'కాళ్లు' అనే శబ్దము సాధువా? అసాధువా? అసాధువయితే, తిక్కన వాడుక తప్పా? సాధువయితే సారంగధరచరిత్రములో వాడినట్టు స్త్రీవర్ణనలో ప్రయోగించవచ్చునా? లేక తిక్కన వాడినట్టు యుద్ధవర్ణనలోనే వాడవలెనా? కొందరంటారు:—'కాళ్లు' అనేశబ్దమొక్కటేకాదు, 'అనరాదు' అని అప్పకవి చెప్పిన 'చెవులు' మొదలయినపనిమిది శబ్దాలకు బహిష్కరణమయినది. ఎవ్వరూ ఎక్కడా వాడకూడదు, పురుషులనిగానీ, స్త్రీలనిగానీ అవయవములను చెప్పినపుడెల్లా గ్రాంథిక పదములే వాడవలెను" అని మరికొందరంటారు:—"యుద్ధపంచకములో తిక్కన వాడినది ప్రమాదముకాదు. ప్రమాణమే" అని, మేమడుగుతున్నాము తెలియక. "అప్పకవి 'చేకొనఁగవలయు' నన్న శబ్దాలు శవాంగములు వర్ణించినప్పుడు వాడవచ్చునా? అప్పుడు వాడితే ఔచిత్యభంగముకాదా?" అని, ఎవరిష్టము వారిది అంటే వాదములేదుగాని అప్పకవి మతమేదయి ఉంటుందో స్పష్టము కాదుగదా.

26. మరి, 'చన్నులు' తప్పని ఎందుచేత వేంకటరాయ శాస్త్రిలవారు పంతులవారిని దూషించినారో తెలుసుకోవలెను. అప్పకవి తప్పన్న శబ్దము 'చండ్లు'గాని 'చన్నులు' కాదు. ఆతడు చేకొనవలయునన్నది, అక్షరాలా నిక్కచన్నుఁగవ పూర్వమందు 'నిక్క' పరమందు 'కవ' (అర్ధానుస్వారాదేశములతోనే) ఉంటేనేగాని, వట్టి 'చన్ను' శబ్దము వాడకూడదని అప్పకవి మతమంటారా శాస్త్రిలవారు? అట్లయితే కన్నులకున్ను అదేగతి కావలెను, కనుదోయి, అనేవాడవలెనంటారా? 'అడుగులు' అన్నప్పుడెల్లా 'చొక్కంపు' అని ముందుచేర్చవలెనా? అదేమోమాకుతెలియదు; మాకు దివ్యదృష్టి లేదు. శాస్త్రిలవారు స్పష్టముగాచెప్పలేదు; విమర్శనలో 68—వ పుటలో 'గొప్పకొప్పు' 'గొప్పచన్నులు': 'పెద్దపిఱుఁదులు'; అని "గ్రామ్యభంగిగా చెప్పుట అసహ్యముగానున్నది," అని ఆక్షేపించినారు.

27. అప్పకవిలక్షణము పట్టుకొని వేంకటరత్నంపంతులవారిని 'పండ్లు' అని ఈక్రిందిపద్యములో ప్రయోగించినందుకు నిందించినారు.

ఆ. చెలియనీదుమొగముచెలఁగుఁజందురుఁడుగఁబండువెన్నెలనిఞఁబండ్లడాలు.

28. అప్పకవి నిరాకరింపకపోయినా, శాస్త్రిలవారు 'చెంపలు' గ్రామ్యమన్నారు. దానికిబదులుగా 'చెక్కులు' వాడమని ఆజ్ఞాపించినారు. అప్పకవి

'బుగ్గలు' గ్రామ్యముచేస్తే, వీరు 'చెంపలు' గ్రామ్యముచేసినారు. మెడికల్ కాలేజీలో విద్యార్థులు ఏ శబ్దము వాడవలెనో విధించినారుకారు.

29. పంతులవారు తమ నాటకములో 94-వ పుటలో "మా పినతల్లి కాళ్ళకు నమస్కారణంబు నొనర్చునప్డు" అని 'కాళ్ళ' శబ్దము ప్రయోగించి వ్రాసినారు. అప్పకవి మతమేదో మాకు స్పష్టముగా తెలియలేదని మీదనే చెప్పివేసినాము. మాకు లోకమూ, కవులూ మాత్రమే ప్రమాణము. శాస్త్రిలవారికి అప్పకవిమాట ప్రమాణము. వారి విమర్శము ఇది :

'కాళ్ళకు—ఈ పదమును కవులు వాడినను వాడిరిగాని గ్రామ్యకక్ష్యవగాహి నున్నది.'

'కాళ్ళు' అని వాడక "చొక్కంపు టడుగులు" అని అనమంటారా ?

30. ఇక అప్పకవిగారి మతమున్ను శాస్త్రిలవారి మతమున్ను ఇంచుమించుగా ఒకటే గనుక రెంటిని కలిపి మేము విమర్శించ వచ్చును. అధర్వణాచార్యులవారి మాట పట్టుకొని అహోబల పండితులవారు శ్రీనాథుని భాషే కాక తిక్కనభాషకూడా నిందించినట్టే, కాకునూరి అప్పన శాస్త్రిల మాట పట్టుకొని వేదము వేంకటరాయ శాస్త్రిలవారు, కొక్కొండ వేంకటరత్నము పంతులవారి భాషే కాక, నన్నయ తిక్కనాదుల భాషకూడా గ్రామ్యమని నిరాకరిస్తారు. ఈ ఆంధ్ర పండితులకు, లౌకికభాషా, గ్రామ్యమే ఆయెను; కవుల గ్రాంథికభాషకూడా నిరాకరించి మూలచ్ఛేదము చేస్తే మరి ఏ భాషకు వీరు లక్షణము నిరూపిస్తారు ? తమ సంకల్పము చొప్పున భాషను పుట్టించి దాని లక్షణము నిర్దుష్టముగా తమ తృప్తికై చెప్పుకొని తమ పాండిత్యము సార్థకము చేసుకోంటారా ? భారతమయినా తిన్నగా చూడకుండా గ్రాంథికాంధ్ర భాషా లక్షణము చెప్పే ఈ పండితులకు గ్రాంథికాంధ్రభాషాదేవి కలలో నిజ స్వరూపము చూపించివేసినది గాబోలు. ఇతరులవలె వారు శ్రమపడి గ్రంథాలు చదువ నక్కరలేదు కాబోలు.

31. 'చన్నులు' మొదలయిన శబ్దముల ప్రస్తావము ఈ కాలములో నాగరకుల చెవులకు ఇంపుగా ఉండకపోయినా, మా మట్టుకు మాకున్ను అసహ్యముగా ఉన్నా, ఇవి గ్రాంథికాంధ్రభాషాలక్షణ శాస్త్రములో మూర్ధాభిషిక్తములుగా పండితులు ఎన్నినవి గనుకను, వేంకటరాయశాస్త్రిలవారు ఇవి అపరిహార్యమని చెప్పి చేసిన విమర్శములో భ్రమాధీనులయి, నిష్కారణముగా వేంకటరత్నము పంతులవారిని నిందించినారని మాకు తోచినది గనుకను వీటిని మేము చర్చించవలసి వచ్చినది. ఇది కేవలము శాస్త్రీయ విషయముగా భావించి సహించవలసినది. వేంకటరాయ శాస్త్రిలవారు కేవలము శబ్దశాస్త్ర జీవులు, శబ్దశాస్త్రమే వారికి జీవాతువు, శబ్దశాస్త్రమే కన్ను, శబ్దశా

స్త్రమే చెవి, సర్వమూ శబ్దశాస్త్రమే. లోకము, లోకముతోపాటు వారున్నూ, మారిపోయినా వారి శబ్దశాస్త్రము మారదు. లోకవ్యవహారము ఏలాగున్నా శబ్దాలు శాస్త్రములో చెప్పినట్టే ఉండవలెనట! నవ్వినా, ఏడ్చినా, దీవించినా, తిట్టినా, తుమ్మినా, దగ్గినా, నిల్చున్నా, కూర్చున్నా, శాస్త్రములో విధించినట్టే కాని, దానికి అణుమాత్రమైనా విరుద్ధముగా గ్రంథాలలో వర్ణించకూడదట. లాక్షణికులు ఏ శబ్దాలు వాడమని అనుశాసించినారో ఆ శబ్దాలే—అక్షరాలా అవే—ఒక అచ్చుగాని, హల్లుగాని, ఎక్కువగాని తక్కువగాని, ఉండరాదట; కత్తుల మీద నాట్యమట! గ్రంథ రచనకు తమవంటి పండితులు తప్ప మరి యెవరు సాహసించినా భిన్నమర్ములు కాక తప్పదట. కొక్కొండ వేంకటరత్నము పంతులవారు సాహసించి చేతకాని సాముచేసి ఒళ్ళంతా తెగ కోసుకున్నారని లోకానికి వెల్లడిచేస్తే, సామాన్యులు ఇట్టి పనిలో చొరబడి ముప్పు తెచ్చుకోక నిరుపద్రవముగా జీవిస్తారని భూతదయ చేతను, శాస్త్రాభిమానము చేతను, వేంకటరాయశాస్త్రులవారు పంతులవారి ప్రమాదములు సవిస్తరముగా నిరూపించి, తమ నైపుణ్యము ప్రకటించి, లోకోపకారకులయినారు. అప్పకవి శాస్త్ర రహస్యములు తెలియకపోవడముచేత పంతులవారికి కలిగినవన్న ప్రమాదములు ఈ వ్యాసము 24-29 పేరాలలో ఉట్టంకించినాము. అవి వివరించి ఇప్పుడు ఉపన్యసిస్తున్నాము.

32. వేంకటరత్నము పంతులవారి గ్రంథమందు ఏమి 'గామ్యభంగిగాను' 'గ్రామ్య కక్ష్యావగాహిగాను' ఉన్నవని అప్పకవి శాస్త్రమును పట్టి శాస్త్రులవారు నిందించినారో, అవి ముందుగా చర్చిస్తాము:—(1) చన్నులు, (2) గొప్పచన్నులు, గొప్ప కొప్పు. (3) పెద్ద పిఱుదులు, (4) బుగ్గలు, చెంపలు (5) పండ్లు, (6) కాళ్ళు. తర్వాత అప్పకవి తప్పన్న తక్కిన మూడుశబ్దములు, అనగా చెవులు, కన్నులు, బొడ్డు వీటినిగురించి తరచుగా విమర్శిస్తాము.

33 (1) చన్నులు—23 వ పేరాలో పంతులవారు 'చన్నులు' అనే శబ్దము ఎట్లా ప్రయోగించినారో తెలియుటకు ఆ శబ్దముగల పద్య ముదాహరించినాము; 24వ పేరాలో శాస్త్రులవారి విమర్శమందలి వాక్యము ఎత్తి వ్రాసినాము. 'అన్నుల చన్నులు' అని వ్రాయడము తప్పో, వాటిమీద 'అనువుగ గోళులుంచుట' తప్పో పంతులవారి పద్యములో ఏది తప్పో తెలియదు, స్తన శల్య పరీక్షకులైన శాస్త్రులవారి దృష్టికి పంతులవారి వర్ణన మెడికల్ కాలేజీ విద్యార్థులు శవాంగ పరీక్ష చేసినట్టున్నదట. నన్నయాది మహాకవులు ఏలాగు ఈశబ్దము వాడివున్నారో చూచి, విచక్షణులు ఔచిత్యము అనౌచిత్యము నిరూపించవలెను.

34. నన్నయ గిరికాదేవిని వర్ణిస్తూ 'వలుఁదచన్నుల బెడంగు' అని, తిక్కన ఉత్తరనువర్ణిస్తూ 'చరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు' అనిరి. ప్రాచీనులు 'చన్నులు' అని బహువచనముగా వాడడము ప్రసిద్ధము. శ్రీనాథుడుకూడా నైషధమందు:—

క. హా రపరీక్షామిషమున భూరమణుఁడు గమిచె నింతి పొంకపుఁ జన్నుల్
కూరిమి నేరిమిఁబులకాంకూరంబులు వొడమఁ జిగురు గోరుల కొనలన్.

అనేపద్యములో, దమయంతి 'చన్నులు' నలుడు 'నేరిమిన్' 'గోరుల కొనలన్' 'కమిచె' నని చెప్పినాడు. 'తరుణిచన్నులు రాజు చిత్తమునుహరించె, అని ఏ విశేషణమూ పూర్వమందు పెట్టక, పరమందు 'దోయికవలు' చేర్చక, వట్టి 'చన్నులు' అని బహువచనరూపము దమయంతిని గురించి చెప్పినప్పుడె నైషధములోనే శ్రీనాథుడే వాడినాడు. ఇట్లే సింగన 'చన్నుల క్రొవ్విదంబు' 'ఇట్టి చన్నులపెంపు' అనిన్ని నాచన సోముడు 'చంద్రికలు వోలెఁ జన్నుల ముత్యాలసరము లమర' అనిన్ని వట్టి బహువచనరూపము, పూర్వమందుగాని పరమందుగాని ఏమిచేర్చకుండానే 'చన్నులు' శబ్దమే వాడినారు. కామశాస్త్రోపనిష దర్ధరహస్య వేత్తలగు పండితుల కుపాధ్యాయ యన దగిన ముద్దుపళని కూడా 'ఎటులోర్వ నున్నవో యీ కన్నె 'చన్నులు గోపసింహునిగోటి కుమ్ములకును' అని రాధను గురించి వ్రాసినది. సత్కావ్యములలో నన్నయ మొదలుకొని కవులందరూ ఈ'చన్నులు'శబ్దము సభ్యవర్ణనలో వాడివున్నారని సిద్ధాంతము చేయడమునకు ఈప్రయోగములు చాలవా? చాలవంటే, చాలి నన్ని ఉదాహరించగలము, మరి, వేంకటరత్నముపంతులవారి వాక్యములో శాస్త్రులవారిబుద్ధికి శవాంగపరీక్ష స్ఫురింపజేసిన శబ్దదోషమేమిటి? 'అన్నుల చన్నులు' అని అన్నులు పూర్వమందుండుట దోషమన్నారంటే చూడండి పోతరాజుకూడా దశమస్కంధము పూర్వభాగములో హేమంతఋతు వర్ణనలో సరిగా 'అన్నుల చన్నుల' అనే వాడినాడు.

క. అన్నుల చన్నుల దండపిపన్నులు గాకెల్లవారు బ్రతికిరిగాకీ
చన్నులుమీటిన వలి నాపన్నులు గాకుండఁ దరమె? బ్రహ్మాదులకున్.

ఇకను 'అన్నుల చన్నులమీద అనువుగా గోరులుంచుట' శవ స్తనములు మెడికల్ కాలేజీ విద్యార్థులు పరీక్షకోసము తీసినట్లున్నదని చెప్పి అసభ్యముగా నెంచినారను కోవడమునకు శాస్త్రులవారికి తెలియని విషయమా. పండితుల సత్కావ్యము లన్నిటిలోనున్న 'నెలవంకలు' 'గోరువంకలు' 'చందురుకూనలు' 'వాఁడిగోళ్ళ జీరుటలు' 'చెక్కుటలు' 'నఖకింశు కార్చనలు' 'కుచకుంభముల మీఁద గోరంకుశంబాని కఱుకు కఱుకు కఱుక్కున నఱికి పట్టుటలు' ఇత్యాదులు?

35. మరి అయితే, పంతులవారి వాక్యములో ఎక్కడ నున్నది అసభ్యత ? శాస్త్రిలవారి విమర్శమువల్లనే మన మూహించి తెలుసుకోవలెను. పంతులవారి పద్యమునకు మూలమయిన జయదేవుని శ్లోకములో 'కాన్తా కుచమండలే కరరుహాః సానన్ద మారోపితాః' అని ఉన్నది. దానికి పంతులవారు తెలుగున 'అనువుగ గోరులుంచఁబడు నన్నుల చన్నులన్' అని వ్రాసినారు. దీనిలోని దోషము శాస్త్రిలవారు ఎట్లు వివరించినారో చూడండి :— (పు 20)

36. "అన్నులని యీ బహువచనమేల ? మూలకారుఁడు 'కుచమండలే' యని ఏకవచనముననే తృప్తిపొందెను గదా! వీరికి మాత్రము 'చన్నుల' నని యీ బహువచన మేల ? 'అన్ను చనుంగవ' యన్న నింత రుచిగా నుండదు గాఁబోలు"

అప్పకవి లక్షణములో విహితమైనట్లు 'నిక్కు జన్నుఁగవ' అని ఏకవచనముగా ఈ శబ్దము వాడక బహువచనముగా చన్నులనడము గ్రామ్యకక్ష్యవగాహి శాస్త్రిలవారికి తోచఁబట్టికాబోలు ఇట్లు ఆక్షేపించి ఉంటారు' ఐతే జయదేవుని శ్లోకమందు 'కాన్తా కుచమండలే' అనే వాక్యమునకు వైధర్మ్యోపన్యాసపరముగా 'మత్తకరీన్ద్ర కుంభశిఖరే' అనే వాక్యమున్నది, గనుక రెంటికి తెలుగులో 'సప్తమైక్యవచన శబ్దమే' వాడవలె నన్నారుగాని 'చన్నులు' అనే శబ్దము బహువచనమందు ప్రయోగించకూడదని శాస్త్రిలవారి తాత్పర్యము గాదంటే, అది వేరే మరి ఒక దోషముగా గణించక, వైద్య శాస్త్రోచితముగా నున్నదని హాస్యముచేసి అప్పకవి లక్షణ ముదాహరించి, 'అప్పకవి చెప్పు హితము వినఁదగు' ఈ ప్రస్తావమందు ఉపదేశించడము అతి ప్రసక్తి అవుతుంది. మూలములో ఏలాగున ఉంటే ఆలాగునే తూచా తప్పకుండా తెలుగు చేసినారు కారని చాలాచోట్ల పంతులవారిని విమర్శకులు నిందించి ఉన్నారు. ప్రసన్న రాఘవము మొట్టమొదటి పద్యములోదే 'చెక్కిళులందు' అనే శబ్దము మూలమందున్న 'గండద్వయె' అనే దానికి సంమముగా లేదనిన్ని, 'ఇట తత్త్యాగము అపకర్షముగా నున్న' దనిన్ని నిందించినారు. చెక్కుదోయి, చెక్కుఁగవ, చెక్కిలిదోయి, చెక్కిలిగవ-ఇట్టిశబ్దమేదైనా సంఖ్యానస్ఫూర్తికై వాడమంటారుగాబోలు. మరి ఒకచోట మూలములోనున్న 'దిక్కాంతాకుచకుంభ కుంకుమ రసన్యాపాయ' అనే వాక్యము తెలుగులో పంతులవారు 'దిక్కరి గమనలు కుంకుమ పూతన్' అని వ్రాస్తే 'మూలలో వీ కి (దిక్కరిగమనలకు) కుచకుంభములున్నవి. కరిగమనము లేదు. సర్వకాలాశాలాధిపులకు (యూనివర్సిటీవారికి) వెరచి పంతులవారు వీరి కుచకుంభములను హరించినందున బరువు తగ్గిన పిమ్మట నింక కరిగమ నమేమి ? హరిణప్లుతమే !' అని శాస్త్రిలవారు ప్రత్యాఖ్యానము చేసినారు. (చూ. విమర్శము పు. 118) కుచకుంభముల

యెడల శాస్త్రులవారికి గల అభిమానముచేత యూనివర్సిటీవారిని ఈ రసికులు ఎట్లు సాకూతముగా చెనకినారో చూచినారా? వారి శాస్త్రమే వారికి ప్రమాణము. యూనివర్సిటీవా రేమంటేనేమి? లోక మేమంటేనేమి? కుచభారములో ఒక వీసమైనా తగ్గించడమునకు శాస్త్రులవారంగీకరించరు!

కీర్తిశేషులయిన కందుకూరి వీరేశలింగము పంతులవారు గోప్యాంగ వర్ణన నిందించి సత్కావ్యములందు ఇట్టి అశ్లీలదోష ముండకూడ దని తమ గ్రంథములలో వ్రాసినారు. వీరి హితోపదేశము శాస్త్రులవారికి గిట్టదుగదా. కీర్తిశేషులయిన సీతారామాచార్యులవారు శబ్దరత్నాకర పీఠికలో 'వీరు (కవులు) వర్ణనలు సేయ మొదలుపెట్టిరా మీరు నమ్ముదురో నమ్మరో తల్లినేని కేశాది నఖ పర్యంత మొక్కయంగమైనఁ జిక్కక శివమెత్తినట్లు వర్ణింపక మానరు. అది యెట్టి పారవశ్యమో యెఱుఁగరాదు' అని గర్హించినారు. మనశాస్త్రుల వారి దృష్టికి ఆచార్యులవారున్ను వీరేశలింగము పంతులవారివలెనే పాషండులు.

37. (2) గొప్ప కొప్పు-గొప్పచన్నులు వేంకటరత్నము పంతులవారి గ్రంథమునందున్న (చూ. 18-వ పుట) "మామండోదరి గొప్పకొప్పున", అనే ఒక వాక్యము విమర్శించి శాస్త్రులవారు "గొప్ప కొప్పున, పెద్దకొప్పున, అని యిట్లు గ్రామ్య భంగిగా 'గొప్ప చన్నులు' 'పెద్దపిఱుఁదులు' అని చెప్పుట అసహ్యముగా నున్నది" అని దూషించినారు, గాని ప్రమాణము చూపించినారుకారు. అప్పకవి లక్షణములో 'గొప్పకొప్పు' గానీ తప్పని చెప్పి ఉండ లేదు. కుటిలత్వము కోమలత్వము కుంతలముల ముఖ్యగుణములట, అవి చెప్పక గొప్పతనముమాత్రము చెప్పినందుకట ఈ దూషణ. కుటిలత్వమున్ను కోమలత్వమున్ను కవులు కుంతలములకు చెప్పినారు గాని కొప్పుకు ఎవరూ చెప్పలేదు. లక్షణ శాస్త్రములో ఈ విషయమును గురించి విధి కనబడనప్పుడు కవుల ప్రయోగములే ప్రమాణము గనుక అవి ఉదాహరిస్తాము. పాండురంగ మహాత్మ్యములో (చూ iii 65) 'పామర ప్రమదలకు తేలెడు కన్నుదోయి', 'ముద్దు మొగంబు' 'అన్నువకౌను' తోపాటు 'గొప్పకొప్పు' పెట్టినట్టే, శ్రీకృష్ణునికిన్ని 'గొప్పకొప్పు' పెట్టి (చూ. IV, 77) "మాసరంబైన మాయూర పింఛంబుతో నైక్యముంబొంది చిక్కంబుచే గొప్పపై కొప్పు గన్పట్ట" అని రామకృష్ణ కవి వర్ణించినాడు. రసికాగ్రగణ్య ముద్దుపళని రాధికాస్వాంతన ములో "నీ గొప్ప కొప్పున కెనయౌనె శిఖికోటి ఘనులతో బహుమైత్రి గన్న యంత" అని కృష్ణుని వర్ణించినది. పామర స్త్రీలకు, పురుషులకు 'గొప్పకొప్పు' ఉచితమైనా ఉత్తమ స్త్రీలకు 'గొప్పకొప్పు' అనుచితమంటే, చూడండి:— శ్రీ గోపీనాథ కవి శ్రీకృష్ణ జన్మఖండములోని వాక్యములు.

సీ. విభుఁడు రాధిక కొప్పు విచ్చిన తోడనే వల్లభు సిగవిచ్చె వనజగంధి
(ఆ. 2)

సీ. "కమనీయ కాంచన కర్మచేలముగట్టి మోమున కస్తూరి బొట్టుదిద్ది
కుసుమదామంబుల గొప్ప కొప్పు మరించి నవ్యమణీభూషణములు దాల్చి
భువనమోహన వేషయై" (2) (అని అయోనిజయైన కళావతివర్ణన)

ఈ కవి ఆధునికుడని ఆక్షేపమయితే, ఆంధ్రపండిత భిషక్కులకు ఆయుర్వేదము, సరసకవుల జీవాతువు, శృంగార రసార్ణవముగదా తారాశశాంక విజయము! అందలి ప్రయోగము సిద్ధమకరధ్వజమువలె భ్రాంతిని పోగొట్టి శాస్త్రిలవారిని హృష్ట పుష్టాంగులనుగా జేయగలదని నమ్ముతున్నాము.

సీ. విప్పు కప్పగు గొప్ప కొప్పున విరినల్ల గలువల దండలు చెలువుమీఱె"

'గొప్ప కొప్పు' తోపాటు "గొప్పచన్నులు" అని చెప్పుటకూడ అస హ్యమన్నారు చూచినారా, 35-వ పేరాలో మే మన్నమాటకు ఇది తార్కాణము కాదా?

38. (3) 'గొప్పకొప్పు'ను నిందిస్తూ వ్రాసిన వాక్యములోనే 'గొప్ప పిఱుఁదులు' కూడా గ్రామ్యమన్నారు. 'పిఱుఁదు' శబ్దము కవులు వాడిన దనిన్ని అదే 'చేకొనఁగవలయు'ననిన్ని అప్పకవి అనుశాసించి ఉండగా, అందుకు విరుద్ధముగా శాస్త్రిలవారు 'గొప్పపిఱుఁదులు' తప్పన్నారేమి? మాకు వింతగా ఉన్నది. ఐనా, పంతులవారు 'గొప్ప పిఱుఁదులు' అని ఎక్కడ ప్రయోగించినారో శాస్త్రిలవారు చెప్పినారు కారు 'గొప్ప' అనే విశేషణము లేకుండా, బహువచన ప్రత్యయములు వర్ణములేకుండా, 'పిఱుదు' అని సీతావర్ణనలో మాకు కనబడ్డది (చూ 75-వ పుట). ఈ వాడుక మహాకవుల వాడుకచొప్పున ఉన్నది; గాని దానికి విరుద్ధముగా లేదు. పిఱుఁదు శబ్దము ఏకవచనముగానే గొప్పకవులందరూ వాడినారు. కొందరు 'గొప్పపిఱుఁదు' అనికూడా అన్నారు. కళాపూర్ణోదయములో "గుబ్బ పాలిండ్లు లేఁగౌను గొప్ప పిఱుఁదు" రాజవాహనవిజయములో "గొప్ప పిఱుదుపెంపు" అప్పకవి గ్రామ్యమన్నది 'ముడ్డి'? దీని రూపాంతరము 'మూడి'శబ్దరత్నాకరమందున్నది? దానికి లక్ష్యము కళాపూర్ణోదయములోని ప్రయోగమున్నది. స్త్రీవర్ణనలోనిదికాదు. మల్లయుద్ధ వర్ణనలో గణపవరపు వెంకన్న "గడ్డము క్రింద ముడ్డియాని" అని వ్రాసినాడు. నేటి వాడుకలో 'తుంటి' 'పిర్రలు' అనేశబ్దములున్నవి: గాని శిష్ట వ్యవహారము చొప్పున గ్రామ్యశబ్దములు. అంతకన్నను ఎక్కువ అసభ్యము 'ముడ్డి.' సంస్కృతము వాడుకభాషగా ఉన్నప్పుడు గాబోలు 'కటి' శబ్దము గ్రామ్యమని శిష్టులు నిషేధించినారు. అయినా 'కటిసూత్రము' గ్రామ్యముకాదు; కల్పములలో

దేవీ పూజలో "కటిం పూజయామి" అని ఉన్నది. శ్రీనాథుఁడు నైషధములో కటిశబ్దము వాడినాడు, తటశబ్ద ఘటితమైనది గనుక శాస్త్రులవా రుపేక్షించి నారు.

39. (4) బుగ్గ, చెంప—ప్రసన్నరాఘవములో (చూ. పుట 24).

సీతావర్ణనలో "ఇప్ప పూమొగ్గవలెను బుగ్గ" అని ఉన్నది. అందుకు "శుకవాణి బుగ్గలు ముకురంబు లనరాదు" అప్పకవి ఇట్లుపయోగింపరాదని చెప్పినాడు" అని శాస్త్రులవారి విమర్శము; గాని వారున్నూ ప్రయోగించినారు. (చూ. పేరా 42).

40. ప్రసన్న రాఘవము (చూ. పుట 65)

చ. 'క్షితిసుతచేత వీవఁబడు కెంజిగురాకుల చల్లగాలి తత్
క్షితిపతి పుత్త్రియుగ్మకము చెంపలఁ జెమ్మటఁ బాపనోపె."

అని పంతులవారు రాజకుమారులకు "చెంపలు" పెట్టితే, శాస్త్రులవారు ఆ శబ్దము 'గ్రామ్య' మని ఆక్షేపించి, 15-వ పుటలో సీతావర్ణనలో మళ్లా ఈ శబ్దము కనబడితే, "మరల నీ శబ్దమును ప్రయోగించుకొన్నారు. ఇది వాడుకలో కలదే యందురు. వాడుకలోని వన్నియుఁ దెచ్చిపెట్టుదురా ? ఇది 'పీకుఁట' వంటిదే అని గట్టిగాబుద్ధి చెప్పినారు.

41. "పీఁకుట" వంటిదే అని చెనకడములో సూచన యేమిటంటే ప్రసన్న రాఘవములో (చూ. పు. 14, 103) రెండు మూడుచోట్ల 'పీఁకుట' అనే శబ్దమున్నది. విమర్శములో—"వీరికింతకన్న శబ్దము దొరకకపోయెనా ! ఏనికగున్నలు తొండముతో నెఱిసింగముల జడలఁజెలఁగుచు బీఁకున్—" ఇట వక్త రాముడు, సప్తమాంకములో వక్త లక్ష్మణుఁడు. ఇట్టి యుత్తమోప నాయక ప్రతి నాయకులకు ఈ గ్రామ్యోక్తి తగదు. పంతులవారు గ్రామ్యత్వ మధమోక్తిషు అని లక్షణము నేర్చుకొనవలయును. వీరి మతమున నీచపాత్ర ములకు లక్షణ విరుద్ధ మయిన గ్రామ్యము పనికిరాదట ! రావణ లక్ష్మణులకు ఈ గ్రామ్యము పనికివచ్చునఁట. ఏమి సరస వ్యవస్థ !' అని ఆక్షేపము. మేము ఈ వ్యాసము 5 వ పేరాలో చెప్పిన మాటకు ఇది తార్కాణము, శాస్త్రుల వారు తమ ప్రతాప రుద్రీయములో నీచపాత్రములకు "గ్రామ్యభాష వాడితే, పంతులవారు గ్రామ్యద్వేషులు గనుక నాటకములలో నీచపాత్రములే కాదు. లోకమందు ఎక్కడా ఎవ్వరూ గ్రామ్యభాష వాడనే కూడదని వాదించినారు, కాగితముమీద గ్రామ్యభాష కనబడితే వారి కండ్లు భగ భగ మండేవి. ఈ వేంకటరత్నము పంతులువారు అట్టివారు గనుక ఈ పంతులవారు వ్రాసిన యీ నాటకములో ఉత్తమ పాత్రములచేత గ్రామ్యభాష మాట్లాడించినట్టు చూపించి ఆక్షేపించడమునకు సందు వెదుకుతూ ఉన్న శాస్త్రులవారికి ఈ

'పీఁకు' శబ్దము కనబడితే ఎంతో అట్టహాసము, సింహనాదము చేసి ఇట్లు వ్రాసినారు, ఎక్కడపడితే అక్కడ 'పీకుటవంటిది' అని విధి విరామము లేకుండా, అయినదానికీ, కానిదానికీ చెనకి చెనకి చంపినారు. అయితే శాస్త్రిల వారి విమర్శములలో ఒక విశేష మున్నది. అది చూస్తే కోపమూ వస్తుంది, నవ్వూ వస్తుంది. ఇతరులను ఏ దోషములకు గాను వీరు నిందిస్తారో, ఆ దోషములు తాము చేసినవన్నమాట మరిచిపోతారు గాబోలు. ఒకవేళ జ్ఞప్తి యందుంటే ఆ విషయము ఎవరికీ తెలియదని, ఎవరూ కనుక్కోలేరని అనుకొంటారు గాబోలు. గడుసువారేగాని మోసపోయినారు, ఈ వ్యాసము రెండవ భాగములో ఇట్టి విశేషములు కొన్ని విమర్శిస్తాము. 'పీఁకు' శబ్దము గ్రామ్యమని ఇంత పీకులాడిన శాస్త్రిలవారు తాము రచించిన కథాసరిత్సాగరమునందు ఈ పీఁకు శబ్దము ఏలాగున వాడినారో చూడండి "ఆ ఘోర వానరము అతనిమీద బడి బుద్ధిపూర్వకముగా అతని పాపమునకు శాస్తిచేయు నదియుంబోలె ముక్కు కొఱికివేసి గోళ్ళతో చెవులు పీకివేసి పాఱిపోయెను" (చూ. పుట 101, పంక్తి 1) ఈ వాక్యము అధమ పాత్రము నోటి నుండి వచ్చినది కాదు, కథకులయిన శాస్త్రిలవారు తమ నోటను తాము పెట్టుకొన్నదే. ఇట్టి వాక్యములో "పీకి" గ్రామ్యమైతే, ఆ శబ్దము ప్రయోగించవచ్చునా? కథా సరిత్సాగరమందు 'వానరము' 'సన్యాసి చెవులు' 'పీకుట' గ్రామ్యము కాకపోతే, ప్రసన్నరాఘవమందు 'ఏనిక గున్నలు సింగముల జడలుపీకుట' గ్రామ్యమెందు కవుతుంది? ద్వితీయ ముద్రణమందుకూడా ఈ పీఁకుశబ్దమట్లే ఉన్నది. అరసున్న మాత్రము అధికముగా నున్నది. (చూ. పు. 186) ఇంకా మరికొన్ని వాక్యములలోకూడా ఈ 'పీఁకు' ఉన్నది యతికథలో (చూ. పు. 242 అడుగునుండి రెండవ పంక్తి) 'అభిక్షువు ఒకకంటిని పీక చేతఁబెట్టుకొని ఇట్లనియె,' అనే వాక్యమున్నది. ఇది నీచపాత్రము నోటిమాటకాదు. హాస్యోక్తి కాదు. కథకులుగాఁశాస్త్రిలవారు స్వముఖమున వచించినవాక్యము. రెండవ ముద్రణములో 'పెల్లగించి' అని దిద్దుకొన్నారు. (చూ. పు. 449 పంక్తి 15). మొదటిముద్రణము 1891 సం.ముద్రి; రెండవది 1911 సం॥ముద్రి. పంతులవారి ప్రసన్న రాఘవము 1897 వ సం. లోను శాస్త్రిలవారి విమర్శము 1893 సం. లోను అచ్చు పడ్డవి. ఇట్టి చిత్రములు ఈ వ్యాసము మూడవభాగములో అనేకములు చూపిస్తాము-ఇపుడివి చాలును.

42. 'బుగ్గలు' గ్రామ్యమని అప్పకవి నిషేధించినది నిజమే; గాని వేంకటరాయశాస్త్రిలవారుకూడా వేంకటరత్నము పంతులవారివలెనే తమ నాటకమందు 'లేకిడుతమ్మి మొగ్గకెల రేదొరబుగ్గకు నాదు పట్టికిన్గాకతి వంశ వీరునికిఁ గంజజుఁ డేమిగతిన్ లిఖించెనో' (అంక. III) అని ఉత్తమపాత్ర

నోటనే, ఉత్తమ పాత్రనుగురించే 'బుగ్గ' అని పలికించినారే; 'చెంపలునూ' గ్రామ్యమనుటకు శాస్త్రప్రమాణము శాస్త్రిలవారు చూపించలేదు. పంతులవారు 'చెక్కిలి' శబ్దము ఎరుగనివారు కారు. మొట్టమొదట పద్యముగాను ఇంకను మరికొన్ని చోట్లను (చూ. పు, 972) 'చెక్కిళులు' ప్రయోగించినారు. 'చెక్కిలి' పద్యమందు పట్టకపోతే 'చెంప' పెట్టుకొన్నారు. చెంప శబ్దము 'కపోలము' 'గండస్థలము'లకు పర్యాయపదముగా పూర్వకవులు వాడకపోయినా; 'చెంప కొప్పు' వర్ణించినారు. (చూ. భానుమతీపరిణయము: ప్రాగ్దిశ చెంపకొప్పు) 'చెంపకాయలు'కు బదులు 'చెక్కిలికాయలు' 'చెక్కుకాయలు' అనరు. 'చెక్కులు' అనగా 'బుగ్గలు' అవునోకాదో ? బుగ్గలు ఉబ్బెత్తుగా వుంటేనే అందము. చెక్కిలి కపోలమయితే, కపోలభిత్తి కపోలఫలకము అని కవులు వర్ణించినారు. చెక్కిళ్లు, చెక్కులు, చెంపలు, బుగ్గలు, కపోలము. గండస్థలము, గల్లము: ఇవి అన్నీ కవులు తమ ఇష్టానుసారముగా వాడితే తప్పు పట్టకూడదని మా మతము. నైషధములో (3. 208) శ్రీనాథుడు వాడిన గల్ల శబ్దము 'గ్రామ్యతా దోషావహమని ఆలంకారికు లాక్షేపింతురని' శాస్త్రిలవారు వ్యాఖ్యలో వ్రాసి ఊరుకొన్నారు. ఆత్మవిశ్వాసము, ఆత్మగౌరవముగల కవులు శుష్కలక్షణము నకు భయపడరు. భవభూతి గల్ల శబ్దము నిరాటంకముగా మాలతీమాధవమందు వాడినాడు కాడా ? మనుచరిత్రలో (5. 69) పెద్దన పాండురంగ మహాత్మ్య మందు (1. 94) రామకృష్ణుడు సభ్య వర్ణనమందే గల్ల శబ్దము ప్రయోగించి నారు. వారిని ఏమి చేయగలిగినది లక్షణశాస్త్రము ? పిల్లలను భయపెట్టేబూచి ! గల్లశబ్దము సంస్కృతములోనిది కానే కాదు. ఇది ప్రాకృత శబ్దము. వాల్మీకి ప్రాకృత సూత్రములలో 1. 3. 105 గోణాద్యా:—51 'గణ్డస్థలే గల్లో' అని ఉన్నది. అందుచేతనే కాబోలు సంస్కృతము వాడుకభాషగా ఉన్న కాలమందు ప్రాకృత సాంకర్యము నిషేధించినారు. వాడుకలో లేని ప్రాచీన శబ్దములు, ఛాందసములు 'ఆర్షములు అని' సాంకర్యమిష్టము లేకనే ఆ కాలములో ఇట్టివి కూడా శిష్టులు నిరాకరించి ఉంటారు. ఇట్లే వాడుకలో లేని కేవల గ్రాంథిక శబ్దములున్ను పామరులుమాత్రము వాడే గ్రామ్యములున్ను శిష్టుల లౌకికభాషలో కలియకూడదన్న నియమము, ఇంగ్లీషులో ఉన్నట్టు, పెట్టుకోవడము మంచిది.

43, (5) పండ్లు—'చెలియ నీదు మొగము చెలఁగుఁ జందురుఁడుఁగఁ బండువెన్నెల నిడుఁబండ్లడాలు' అని పంతులవారు చేటిచేత సీతను వర్ణింపించి నారు. (చూ. పు. 29) ఈ వాక్యమందలి 'పండ్లు' అనే శబ్దమును దూషించి తమ విమర్శమందు—పండ్లట ! చెలి పండ్లు మల్లె మొగ్గలనరాదు' 'అని అప్ప కవి' అని శాస్త్రిలవారు ఉపదేశించినారు. వీరికి అప్పకవి గురువయితే

వారికి గణపవరపు వెంకటకవి గురువు. చూడండి వెంకటకవి చెప్పిన లక్షణము ; ప్రబంధరాజ విజయ వెంకటేశ్వర విలాసము (పు. 114)

సీ తులు మహి మోము చంద్రుఁడు నుదు రలినెల
 బొమలు విం డ్లక్షు లేణములు ముక్కు
నువుఁబువ్వు చెవులు శ్రీల్ నునుబండ్లు మొల్ల ల
 ధర మిగు ర్చెక్కు లద్దములు గవుద
తాటిగింజ మెడ చిందము వ్రేళ్ళు పగడముల్
 కరము లబ్జములు కక్షములు దిరుగు
దులు కేలు తూండ్లు గుబ్బలు గిరు ల్వళు లల
 రిరు వాల్ నాభి గుహ నడుము
కటు లరులు తొడ లంట్లు మోఁకాళ్ళు బొంగ
 రములు పిక్కలు పొదులు గుల్ఫము లరడలు
ప్రపదములు కూర్మములు నఖరము లుడుల
 దగు లెడదమ్ములు వెనుపల్క వెలఁది కొప్పు.

ఈ వెంకటకవి అప్పకవికి ఎందులో తక్కువ ? ఎన్నో గ్రంథాలు వ్రాసినాడు. అతని ప్రబంధరాజ విజయ వెంకటేశ్వర విలాసమునకు కీర్తిశేషులయిన పూండ్ల రామకృష్ణయ్యగారు వ్రాసిన పీఠిక చూడండి. 'అమ్మా ! ఇంతవాడా ఈయన !' అని మీరు ఆశ్చర్యపడతారు. ఇతడు గొప్ప లాక్షణికుడని, మహా ప్రౌఢుడని శ్రీమోథే జగన్నాధ మల్లుగారు వ్రాసినారు. గనుక పంతులవారి ప్రయోగము లక్షణవిరుద్ధము ఎంతమాత్రము కాదు. వెంకటకవి లక్షణము తప్పని ఒకరంటే, 'కాదు అప్పకవి లక్షణమే తప్పు' అని ఇంకొకరంటారు మా మతము యిదివరకే చెప్పినాము గదా. ఏ లక్షణము కవిప్రయోగానురోధమూ అదే ఒప్పు. కవి ప్రయోగములలో వైవిధ్యముంటే అంగీకరించవలసినదే. కవులు యథేష్టముగా లోకమునుండిగాని గ్రంథములనుండిగాని శబ్దములు గ్రహిస్తారు, కూడదని నిషేధించడానికి ఈ శాస్త్రులవారెవరు ? ఆయన కెవరిచ్చినారు ఈ యధికారము ? లేని అధికారము తెచ్చిపెట్టుకొని, ధూం ! ధాం ! హూత్ ! హాత్ ! అని అంటే ఎవరు మన్నిస్తారు వారిని ?

44. నన్నయ 'పండ్లు' శబ్దము వాడిఉంటే మాకు కనబడలేదు, గాని తిక్కన గ్రంథములందు చాలచోట్ల అది చూచినాము, (స్త్రీ వర్ణనలో కాదు.) ఈ ప్రయోగము చూడండి, గ్రామ్యమో అగ్రామ్యమో మీరే విచారించండి.

చ. వినుము జరానుబంధమున వెంబ్రుక తండముఁ బండ్లు వీనులుం
గనుఁగవయున్ జరంబొరయుఁగాని యొకప్పుడుఁ దృష్ణజీర్ణగా।
దు. (అనుశా. 1. 147)

శ్రీనాథుదు కాశీఖండమందు (చూ. 3. 84) గీ. పండ్లు పేర్వాసికదలు చూపకయున్న కాలుసేయాడు తఱియంద కదలవలయుఁ దీర్ఘసేవకు' అనిన్ని సాముద్రిక శాస్త్రము చెప్పున పురుషుని కల్యాణలక్షణములు వర్ణిస్తూ, సీ. గీ....'భాగ్యనిధి ముప్పదియు రెండుపండ్లవాఁడు' (చూ. 4 31) అనిన్ని వ్రాసినాడు. పాండురంగ మహాత్మ్యమునందు (చూ.2.137) 'భక్తివృద్ధుఁడు గాఁగ బాటించె నీ వేల్పు ప్రహ్లాదుఁ గడుఁబాల పండ్లనాఁడ' అని ఉన్నది.

45. (6) కాళ్ళు—ఈవ్యాసము 25వ పేరాలో, అప్పకవి 'కాళ్ళు' శబ్దము గ్రామ్యమన్నాడో, లేక గ్రామ్యమనిన్ని ఎక్కడా వాడకూడదనిన్ని నిషేధించినాడో. లేక ఒక్క స్త్రీ వర్ణనలో మాత్రమే కూడదన్నాడో స్పష్టముగా తెలియడములేదని వ్రాసినాము, గాని గుప్తార్థ ప్రకాశికయందు బ్ర. శ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రిలవారు 'అప్పకవిగారి మతంబున 'హరి మధ్య కాళ్ళి గుళ్ళనఁగరాదు' అను పద్యంబుచే 'కాళ్ళు' అని ప్రయోగింపఁగూడదనియే సిద్ధాంతపఱచిరి. కాని 'కాళ్ళనుటకుఁ గవిశేఖరుల ప్రయోగంబులు భారతమునందుఁ బెక్కులు గలవు" అని చెప్పి, ఈ క్రిందను వ్రాసిన మూడు ప్రయోగము లుదాహరించి 'ఇంకను బ్రయోగంబులు పెక్కులు గలవు' అన్నారు:—(1) భార. ఆది. క. కడకాళ్ళుపట్టివానిని, (2) అది. ఆ. 5. క. 'వీని రోయుదీఁగ కాళ్ళంఁబెనంగె' (3) విరా. ఆ. 1 సీ. 'కాళ్ళ యొప్పిద మాడు కట్లనుజ్వలము చేయంగ,' గుప్తార్థప్రకాశికాకారులు అప్పకవి మతము అంగీకరించక పోవుటకు కారణమేమిటి? అతనిమతము కవిశేఖరుల ప్రయోగములకు విరుద్ధముగా ఉండడమేగదా। అప్పకవికి పూర్వులయిన ఆదికవులు నన్నయ తిక్కనలు రచించిన గ్రంథమందు పెక్కు ప్రయోగము లుండగా (వాటిని చూడకగాని ఉపేక్షించిగాని నిరాకరించిగాని) వాటికి వ్యత్యస్తముగా అతడు చెప్పిన లక్షణము తప్పని సిద్ధాంతమయినది గదా. కల్లూరి వేంకటరామశాస్త్రిలవారు గ్రామ్యవాదులుకారు; వారికి 'గ్రామ్యము'లు అసహ్యములు. అయితే, వీరికిన్ని వీరివంటి పండితులకున్ను ఇతరుల 'గ్రామ్యము' ఒకప్పుడు సహ్యమున్ను అగ్రామ్యమున్ను అవుతుంది. అప్పకవి నిరాకరించినవి కొన్ని అంగీకరించినట్టే కేతన గ్రామ్యమన్నవి కొన్ని అగ్రామ్యములని ఈ శాస్త్రిలవారు సిద్ధాంతము చేసినారు. మేముకూడా ఈ పండితులవలెనే, ఇతరులు చేసిన సిద్ధాంతములు అమోఘములని విశ్వసింపక. అవి లోకవిరుద్ధములుగా తోచినప్పుడు విమర్శించి స్వయముగా యధార్థము లవునో కావో

నిర్ణయించుకొంటున్నాము. ఇతరులు అందరూ ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా ఎవరి తృప్తికోసము వారు మాతృభాషావిషయములో ఇట్టి మీమాంస చేయడమునకు అధికారము గలవాళ్లే గదా. మాతృభాష ఒక్కరిసొమ్ముకాదు; పండితులు గుత్తకొన్నదిగాదు.

4౨. అప్పకవి బాగా భారతము చదువుకోలేదనితోస్తుంది. బాగా చదువుకొనివుంటే, 'రణము వర్ణించుచో వీరరసమునందు యుద్ధ పంచకమునఁ దిక్కయజ్వసారెఁ గాళ్ళటంచు రచించుట గాంచి కవులు చెప్పుకొనిరి మీఁగాళ్ళని చెలఁగి కృతుల' అని ఆతడు వ్రాయకపోవును, 'కాళ్లు' 'కాలు' శబ్దములు నన్నయే వాడినాడు. గుప్తార్థప్రకాశికలో ఉదాహరించిన మొదటి వాక్యములో 'కడకాళ్లు' అని ఉన్నది గాని 'కాళ్ళు' అని లేదు, ఆ 'కడకాళ్ళు'యినా ఉత్తమ స్త్రీవీకావు; ఉత్తమపురుషునివీ కావు. రెండవ వాక్యము సామెత. వాటికన్న మంచిప్రయోగములుదాహరిస్తాము, ఆది. 5. 18లో 'కుంతి....గంగనీళ్ళఁగాళ్ళు మొగంబుఁగడిగికొని' అన్నవాక్యమందు కుంతివంటి ఉత్తమక్షత్రియ స్త్రీవిషయములో 'కాళ్ళు' శబ్దమున్నది. ఆది 6. 289 లో 'భీమసేనుండు....కాళ్ళు గడిగికొని యాచమనంబుసేసి' అని, భీమునివంటి ఉత్తమక్షత్రియ వీరుని విషయములో కూడా ఈ శబ్దము నన్నయే వాడినాడు. యుద్ధపంచకమందేకాక విరాట 1. 238 లో 'కాళ్ళుయొప్పిద' మని అర్జునుని విషయములోను. విరా 2. 17 లో 'కాళ్ళను జేతులు వ్రేల' అని మల్లుని విషయమందును, భీష్మ. 1. 181 లో అర్జునుడు తన అవస్థ కృష్ణునితో చెప్పుకొన్న, 'నిరతముగాదు గాండివము నిల్వఁగనోర్వవుగాళ్ళు' అనే వాక్యమున అర్జునుని విషయమందున్న, తిక్కన వాడినాడు. నిర్వచనోత్తరరామాయణమందు కూడా (చూ. 6. 14) కృపబుట్ట నన్న కాళ్ళుం బడియెన్' అని వేంకటరత్నము పంతులవారన్నట్లే సరిగా ఉన్నది. వీర రసమునందు యుద్ధపంచకమున కనబడేవి తెగినకాళ్ళు మొదలయినవి గనక అవి వేంకటరాయశాస్త్రిలవారు 'అన్ను లచన్నుల'ను గురించి చెప్పినట్టే మెడికల్ కాలేజీ విద్యార్థులు పరిక్షకోసము కోసిపెట్టుకొన్న శవాంగములని అంటారు గాబోలు. అప్పకవి కూడా ఉత్సాహమునకు లక్ష్యముగా రచించిన పద్యములో (చూ. 4. 277) 'కృష్ణుఁ డొడిసి కాళ్ళు వట్టిపెన్ ద్రోహిచావు మనుచుఖరునినద్రోచెఁ గాళ్ళు మీదుగాన్' అని కాళ్ళుశబ్దము యుద్ధ వర్ణనలో ఉచితముగానెంచి ప్రయోగించినారుగాబోలు. పాండురంగ మహాత్మ్యమందు (చూ. 1, 126) మృగవధాజీవి శుద్ధాంత మీననయనల 'నెఱికురులు' 'నిబ్బరంపు గుబ్బచన్నులు' 'తొడలపెక్కువ' తోపాటు 'కాళ్ళు' కూడా కవి వర్ణించినాడు. సభ్యమో అసభ్యమో కవులకే తెలియవలెను. విజయ విలాసములోని 'కలికినెఱివేణిచెలువంబు కాళ్ళఁబెనఁగ' అనే ప్రయోగ

ముండగా, సారంగధర చరిత్రలోని 'మీఁగాళ్ళు' ఎందుకు అప్పకవి ఉదాహరించినాడో! ప్రభావతీ ప్రద్యుమ్నమందు (చూ. 2. 86) 'కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్లు దనరు' అని పింగళి సూరన ప్రయోగము అప్పకవి చూడలేదు గాబోలు. ఆధునిక కవులలో కూడా 'కాళ్ళు' వాడినవారు ప్రసిద్ధు లున్నారు.

బ్ర. శ్రీ. వడ్డాది సుబ్బరాయ కవిగారు విక్రమోర్వశీయము 3 అం. ఉ....'నీటుగ మేడమీఁద దిగి నివ్వెఱచేఁ దన కాళ్ళు దొట్రిలన్ బోటి పెనంగి ముందరకుఁబుచ్చఁగ నూర్వశి నన్ను డాయునా' అనిన్ని, బ్ర. శ్రీ. మండపాక పార్వతీశ్వర కవిగారు:—'తన కాంచి కాళ్ళఁ బెనంగఁగా' అనిన్ని ప్రయోగించినారు. వీరు అప్పకవీయము చదివినవారేగాని అప్పకవి అనుశాసనము నిరాకరించినారు. ఇకను, 'మోకాళ్ళు', 'మీఁగాళ్ళు' 'గుదిగాళ్ళు' మొదలయినవి తరుచుగా సరస కవులు ప్రయోగించి ఉన్నారు. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నములో (చూ. 2. 86) 'కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్ళు దనరు' అని నాయికనున్ను. గణపవరపు వెంకటకవి ద్వాత్రింశదవయవవర్ణనలో 'మోకాళ్ల బొంగరములు' (చూ. ప్రబంధ రాజ. పు. 115) అనిన్ని వర్ణించినారు. తారాశశాంకవిజయములో—'గుదిగాళ్ళు వెన్నునఁ గూర్చి నొక్కి మదన శాస్త్రు మెఱింగి....' అని ఏ యూనివర్సిటీవారికీ భయపడకుండా, వేంకటరాయ శాస్త్రులవారివంటి రసికులు మెచ్చుకొనేటట్టు రచించిన సరస వర్ణనలో 'గుదిగాళ్ళు' అని ఉన్నది. ఇంతమంది కవుల సరసరచనలలో కనబడుతూఉన్నా, వేంకటరత్నము పంతులవారు వ్రాసిన 'మా పినతల్లి కాళ్ళకు నమస్కరణంబు టొనర్చునప్డు' అనే వాక్యములో ఉన్న 'కాళ్ళకు' శబ్దము నిందించి, వేంకటరాయ శాస్త్రులవారు 'ఈ పదమును కవులు వాడినను వాడిరిగాని గ్రామ్యకక్ష్యవగాహిగా నున్నది' అన్నారుగదా, వారీ ప్రయోగములు ఎరుగక ఆక్షేపించినారని ఊహింతమా? లేక, ఈ కవులందరూ తెలివితక్కువచేత గ్రామ శబ్దము వాడినారనిన్ని నన్నయాది మహాకవులందరి ప్రయోగములు ప్రమాణములు కావనిన్ని నిరసించి శాస్త్రులవారు నిరాకరించి ఉంటారని ఊహింతమా? శాస్త్రులవారు గొప్ప పండితులయితే అయిరిగాని, వారికన్న మా దృష్టికి ఈ కవులె ఎక్కువ గొప్పవారు, ఈ కవులకన్న శాస్త్రులవారి దృష్టికి అప్పకవి గొప్ప పండితుడైతే ఆయెనుగాని మా కీ కవులే పూజ్యులు. లోకములోను, సత్కావ్యములలోను ప్రచురముగా ఉన్న 'కాళ్లు' శబ్దము అప్పకవి లక్షణము చొప్పున గ్రామ్యమని భ్రమపడి శాస్త్రులవారు తాము వాడకుండా ఊరుకొంటే ఊరుకోవచ్చునుగాని, ఇతరులు వాడినప్పుడు గ్రామ్యమని నిందించడము అవివేక విలసిత మనిపించుకోదా?

47. (7) 'చెవులు' అప్పకవి గ్రామ్యమని నిషేధించిన ఈ శబ్దము కూడా వేంకటరత్నము పంతులవారు ప్రసన్న రాఘవములోనే అనేక స్థలములలో వాడి ఉన్నారు. అదేమో శాస్త్రిలవారు ఈ నేరము ఉపేక్షించి ఊరుకొన్నారు. వింతగా ఉన్నది. పంతులవారిని తిట్టడమునకు అవకాశము దొరికితే వృథాపుచ్చవలసినవారు కారు. అప్పకవి అనుశాసనము అక్షరాలా అనుసరించవలసినదే అని శిరసావహించి శాస్త్రిలవారు 'చన్నులు' మొదలయిన శబ్దములు గ్రామ్యములని ఆక్షేపించినట్లే, 'చెవులు' అసభ్యమని తలంచి మరి కొందరు పండితులు ప్రాచీనాంధ్ర గ్రంథములు దిద్దుతున్నారు. గనుక మేమీ శబ్దము అసభ్యము కాదని తిక్కనాది మహాకవుల ప్రయోగము లుదాహరించి సిద్ధాంతము చేస్తున్నాము. ఏ పండితుడైనా తనకు ఈ శబ్ద మిష్టము కాకుంటే తాను మానుకోవచ్చును గాని ఇతరులు వాడితే దూషించడమునకు అధికారము గలవాడు కాడు. ఇతరుల గ్రంథములు పరిష్కరింప బూనుకొన్న పండితులు లేఖక దోషములు దిద్దవలసినదేగాని గ్రంథకర్త వాడిన శబ్దములు మార్చకూడదు. అట్లా మార్చినవాడు కూట కిరణదోషము చేసినవాడే, ద్రోహి.

48. పోతన భాగవతము చదివిన వారందరికీ భాగవత మహాత్మ్యమును వర్ణించి కవి రచించిన పద్యము నాలుక కొనను ఉంటుంది. ఒక్కరీతిగానే దేశమందు అంతటా:—

క. భూషణములు చెవులకు నఘపేషణములు మృత్యుచిత్త భీషణములు హృత్తోషణములు కల్యాణ విశేషణములు హరి గుణో పచిత భాషణముల్,

అనే పాఠము సుప్రసిద్ధమని విన్నాము. మేము చదువుకొన్న అచ్చుపుస్తకములో ఈ పాఠమే ఉన్నది. అయితే 1904 వ సంవత్సరమందు ఆనంద ముద్రాక్షరశాలలో ముద్రితమయిన పుస్తకములో ఈపాఠము కనబడదు: మొదటి చరణములో 'చెవులకు' బదులుగా 'వాణికి' అని ఉన్నది. కళ్ళునులుపుకొని జాగ్రతగా మరీ మరీ చూచినాము. 'వా-ణి-కి' అని మూడక్షరములు స్పష్టముగా ఉన్నవి. పూర్వము అచ్చుపడ్డ పుస్తకములు మళ్లా చూచినాము. 'చెవులకు' అని నాలుగు అక్షరములున్నవి. తాటాకు పుస్తకాలు చూచినాము. వాటిలోకూడా 'చెవులకు' అనే ఉన్నది. ఈ మార్పును గురించి పీఠికలో ఏమయినా పరిష్కర్తలు, రాయదుర్గము నరసయ్యశాస్త్రిలవారు, తంజనగరం తేవప్పెరు మాళ్ళయ్యవారు, వ్రాసినారేమో అని చూచినాము; గాని అందులో ఏమీ కానరాలేదు; అయితే బ్ర. శ్రీ నాగపూడి కుప్పుసామయ్య బి. ఏ. గారు వ్రాసిన పీఠికలో (చూ. పు, 12) "శబ్దాలంకార విశేషమును బోతన నానావిధ చిత్రగతులవీనుల విందుగా రచియించి యున్నవాడు" అని, "భూషణములు సెవులకు" అనేపద్యము, 'సెవులకు' అనేశబ్దముగల పాఠమే, ఉదాహరించినారు,

కుప్పుసామయ్యగారు గ్రంథములో ఉన్న "భూషణములు వాణికి" అనే పాఠము చూచి, ఎత్తుకోక, "భూషణములు సెవులకు" అని తమకు సుపరిచితమై జిహ్వాగ్రమందున్న పాఠమే ఉదాహరించడము మా ఊహను బలపరుస్తున్నది; ఇంతేకాక, ఈ పద్యములో 'హరిగుణోపచిత భాషణములు' వాణికి భూషణము లని చెప్పితే, తక్కిన విశేషణములు సంగతమయి పొందికగా కనబడవు:* పొందినా, పరిష్కర్తలు అప్పకవి అవివేకముచేత చెప్పిన తప్పులక్షణము ప్రమాణముగా చేసుకొని, ప్రసిద్ధమయి ఉన్న పాఠమునుమార్చి, లేని పాఠము చేర్చి పోతన గ్రంథము పరిష్కరించి ఉంటే, అట్టిపరిష్కృతి ఘోరమయిన దుష్కృతి అవుతుంది. దానికి మరి నిష్కృతి లేదు తంజపురి తేవప్పెరు మాళ్ళయ్యవార్లంగారు ఏతాటాకు పుస్తకములలో "భూషణములు వాణికి" అనే పాఠముచూచినారో, తక్కిన తాటాకుపుస్తకములో నున్న "భూషణములు సెవులకు" అనే పాఠముకన్న ఈ పాఠము మంచిదనిన్ని పోతన్న ఇట్లే వ్రాసి ఉంటాడనిన్ని ఊహించడమునకు తమకు ఏమికారణములున్నవో, చెప్పవలసిన వారయియున్నారు. అయ్యో పోతనామాత్యా ! అయ్యో ఆంధ్రభాగవతమా ! పోతన ఒంటిమిట్టవాడా ? ఓరుగంటివాడా ? అని తగవులాడుతున్నారు గాని పోతన గ్రంథము తారుమారుఅయితేచూడరు, చింతించరు.

అప్పకవిబోధితులయిన యిప్పటికవిపుంగవులుతప్ప నన్నయ మొదలు కొని మహాకవులందరూ 'వీనులు' 'చెవులు' అనేశబ్దములు పర్యాయపదము లుగా, పద్యములో ఏది ఇమిడితే అదేవాడుతున్నారు. 'వీనులు' అనేశబ్దమునకు ఏకవచనము లేనందున, ఒకదానిని మాత్రమే చెప్పినపుడు 'చెవి' అనక తీరదు. 'పెడచెవులనిడితి' (ఆశ్ర. 1, 21) మొదలయిన నుడికారములలో పలుకుబడి తప్పకూడదు; 'పెడవీనులు' అనరు. 'చేటచెవులవేల్పు' అనుటకు మారుగా 'చేటవీనులవేల్పు' అంటే అసహ్యముగా ఉంటుంది. ఆంధ్రనామ సంగ్రహము, సాంబనిఘంటువు, ఆంధ్రభాషార్ణవము, మొదలయిన కోశ ములలో 'వీనులు' 'చెవులు' చేరి ఉన్నవి. 'చెవులకు నుత్సవంబొందు చుండ' (అర. 1. 357) అని నన్నయ వాడినాడు. 'చెవులకునింపెసఁగ' (శాంతి III 395) 'నా చెవుల కింపారన్' (శాంతి VII. 135), 'చెవులారఁ వింటి' (ఆశ్ర. II. 130) అని తిక్కన, చెవులు చల్లంజేయన్ (శృ. శా. II 39) అని పిల్లలమర్రి పినవీరన-ఇట్లు కవులందరూ ప్రయోగించినారు, అప్ప కవే బంధ కవిత్వలక్షణములో (IV. 384 సీ. పా) 'కవులకుఁ జెవులపండు వులు సేయ' అని వ్రాసినాడు. 'కావ్యంబు సరసులైన కవుల చెవులకు నెక్కిన

---

*అఖ్యాహి కథాసారం మమకర్ణరసాయనం (భాగ 1.3) అని శ్రీమ ద్భాగవతమాహాత్మ్యమందున్నది.

గాని నమ్మఁ దెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు' (నిర్వ 9) అని తిక్కన చాలా కాలము క్రిందటనే కవులకు 'చెవులు' పెట్టినాడు. 'పవడంపు జొత్తుల చెవుల రూపడఁగంగ' అని అర్జునునికిన్ని చెవు లుంచినాడు (చూ. విరా. 228). కవులకున్ను ఇతర పురుషులకున్ను 'చెవులు' పెట్టడము తప్పుకాదు గాని, ఉత్తమ స్త్రీలకు చెవులు, పెట్టితే గ్రామ్యతాదోషము కలుగుతుంది' అని వాదించే వారిని పట్టుకొని పీడిస్తూఉన్నపిశాచమును పారదోలుటకు ఈ ప్రయోగమంత్రము ఉపచరిస్తుంది. (చూ. నిర్వ. VIII. 47)

చ. పొలయు సమీరణంబు నినుపుందనుపుం దగ నంపు నెమ్మనం
బుల నొకయింపుఁ బెంప రతిబోటులు విభ్రమమొప్ప వీఁగుఁజ
న్నులపయిఁగే లమర్చుచుఁ జనూలత లించుక గొంక గుంతలం
బులు మెల పొందఁగాఁ జెవుల పొందునఁ జేర్చుచుఁగూడి వేడుకన్,

ఇట్లు సీతాదేవికి, ఆవిడచెలులకు 'చెవులు' పెట్టుటకు తిక్కన జంక లేదు. అయితేఅతడు అప్పకవీయము చదువుకోలేదు; అప్పకవీయము చదువు కొన్న బ్ర. శ్రీ. వావిలి కొలను సుబ్బారావు పంతులవారు కుమారాభ్యుదయ ములో (1. సీ. పా.) 'శ్రీ విలాసంబు నిసీయను చెవులను గమ్మల గొలుసులఁ గడఁక నిలిపి' అని ప్రయోగించడము వింతకాదా ? అంత కన్నా వింతకాదా ఈ సుబ్బారావు పంతులవారే తమ సులభ వ్యాకరణములో (చూ. 3-వభాగము, పుట 25) 'చెవులలోఁ గమ్మలు పెట్టుకొని' అని ఉత్తమ స్త్రీల వర్ణించుట యందు 'చెవులు' యోగ్యమయిన పదము కాదనిన్ని 'వీనులఁ గమ్మలు మెఱుంగులు గ్రుమ్మరింప' అని చెప్పనగుననిన్ని బడిపిల్లల కోసము అనుశా సించడము ? లాక్షణికుల అనుశాసనమునకున్ను వారి వ్యవహారమునకున్ను వైరుధ్యమున్నప్పుడు వాటిలో ఏది శిష్ట వ్యవహారానురోధముగా ఉంటే అదే గ్రాహ్య మవుతుంది. అప్పకవిగాని వావిలికొలను సుబ్బారావు పంతులవారు గాని, వేదము వేంకటరాయ శాస్త్రిలవారు గాని, ఏలేశ్వరోపాధ్యాయులుగాని ఎవరు లక్షణము చెప్పినా, లోకవిరుద్ధమైతే చెల్లఁకూడదు. అప్పకవి, వేదము వేంకటరాయ శాస్త్రిలవారు, వావిలకొలను సుబ్బారావు పంతులవారు 'చెవులు' అనే శబ్దము అసభ్యమన్నా, వీరికంటే తక్కువవాడు కాడు, గణపవరపు వెంకటకవి 'చెవులు' అగ్రామ్యమని, 'చెవుల్ శ్రీల్' అని లక్షణము చెప్పి నాడు. (చూ. ఈ వ్యాసము 43 వ పేరా). 'శ్రీలుదా రౌట నాశ్రితపద్మకర్ణి కాకృతిఁ జెవుల్ కమలకర్ణికల మెఱయ' అనిన్ని, 'శ్రీమించు చెవుల గొజ్జగలు మెఱయ' అనిన్ని ఆముక్త మాల్యదలో కవి 'చెవులు' ప్రయోగించడము సరస కవుల చెవులకు కటువుగా ఉన్నదా ? తియ్యగా ఉన్నబా ? ఇది గోపికాది క్షుద్ర స్త్రీవర్ణన కనుక 'చెవులు' శబ్దము కవి వాడినాడని అప్పకవి శిష్యుల

సమాధాన పడుదురేమో! స్త్రీలయిన చెవులున్ను, స్త్రీలను మించిన చెవులున్ను అసభ్యవర్ణనలో ఉచితమగునా? పుస్తకము విప్పి పద్యాలు బాగా చదువుకొంటే తెలుస్తుంది, సభ్యమో అసభ్యమో. 'చెవులు' లేకుంటే పండితుల కుండలాలు. పేరంటాళ్ళ చెవాకులు, చెవుల పువ్వులు. ఎక్కడ పెట్టడము? వినడానికి 'వీనులు' పుట్టినా, గుసగుస లాడడానికి 'చెవులే' కావలెను. 'చెవులు' చర్చ యింతటితో చాలును.

50. (8) కన్నులు. 'చన్నులు' 'కన్నులు' గ్రామ్యమని అప్పకవి నిరాకరించినా డనుకొనేవారు కేవలము బాలిశులు. అప్పకవి నిరాకరించిన శబ్దములు 'కండ్లు', 'చండ్లు' గాని 'కన్నులు', 'చన్నులు' కావు. తాటాకు పుస్తకాలన్నిటిలోను 'కండ్లు', 'చండ్లు' అనే వ్రాసి ఉన్నది. 18,9 వ సం,లో మొట్టమొదట అప్పకవీయము పరిష్కరించి ముద్రించిన పండితుడు తెలివి తక్కువచేత దిద్దినాడు. అప్పటినుండి ఇప్పటివరకూ ఆతప్పు అలాగే అచ్చుపడుతూ ఉన్నది. పండితులందరూ కండ్లుమూసుకొని కూర్చున్నారు. పాండిత్య మీలాగున్నది కన్నులు గ్రామ్యమని అప్పకవి నిషేధించినా డనుకోవడము అజ్ఞానమువల్లనని చెప్పవచ్చును గాని, ఆశబ్దము గ్రామ్యమని నమ్మికొని విడిచిపెట్టడము అవివేక మనక తప్పదు. మరి, ఆశబ్దము ఏదైనా గ్రంథములో కనబడితే, ఆ గ్రంథము వ్రాసినవానిని నిందించడము, గ్రంథము దిద్దడము అతిసాహసము కాదా? పండిత పరిష్కరణమువల్ల పాడుకావడము ఒక్క అప్పకవీయమే కాదు; సరసభూపాలీయముకూడాను. అచ్చు పుస్తకములో 4 వ ఆశ్వాసము 10 వ పద్యము చూడండి:—

క. పామరుల భాషగ్రామ్యము భామిని కటి గల్లములు విభాసిల్లు ననన్
గోమలి చన్నులుఁగన్నులు గాముని పండువు లొనర్చెఁగడువడి ననఁగన్,

మావద్దనున్న వ్రాతప్రతిలో ఉత్తరార్ధము ఇట్లాలేదు. "గోమలిచండ్లు కండ్లకు నామని పండువు లొనర్చుననిశముననగన్" అని ఉన్నది. (డ్లు అనే అక్షరముమీద 'డులు' అని వ్రాసిఉన్నది.) పూర్వులు ఎవరూ 'కన్నులు' గ్రామ్యమని చెప్పనే లేదు. మహాకవులు రచించిన గ్రంథాలు బాగా చదవకుండా అప్పకవీయములాటి లక్షణము మాత్రము వల్లించుకొని తప్పొప్పులు ఏర్పరిచే తెలివిలేని లాక్షణికులు, ఇప్పటివారు కన్నులు, గ్రామ్యమని బడిపిల్లలకు వ్యాకరణాలలో వ్రాసి బోధపరుస్తున్నారు 'గ్రామ్యకబాష' తెలిసినవారు వేయిమందిలో ఒకడయినా ఉండడు. కనుక పండితు లేమంటే అదే సత్యమని లోకులు నమ్ముతారు. "కానని వాని నూఁతగొని కానని వాఁడు విశిష్టవస్తువుల్ గాననిభంగి" గుడ్డిపండితులను నమ్ముకొని తెలుగువారు మోసపోతున్నారు. ఈ కాలమందు మరి యే దేశములోనైనా దేశభాషా పాండిత్యము ఇట్టి దురవస్థలో నున్నదా?

దేశాభాషతో తమకేమీ సంబంధము లేనట్టు దేశభాష గుడ్డిపండితులకు గుత్త కిచ్చివేసి, తాము కళ్ళుమూసుకొని ఊరుకొన్న నాగరకులు మరియేదేశమందైనా క్రీ. శ. ఇరవైయో శతాబ్దమందున్నారా? ఏమికర్మము! ఏమిపాపము' తెలుగు భాషకు, తెలుగువారికి ఏమి ఇంత దుర్గతి పట్టినది! దేశస్థులభాష, దేశమందున్న శిష్టులభాష, గ్రామ్యమట! పండితులకైనా బాగారానిది గ్రాంథికభాషట! అయ్యో! దేశభాషా! నిన్ను తృణీకరించడముచేతనేగదా నూటికి పదిమందైనా తెలుగక్షరాలు వచ్చినవాళ్లు దేశములో లేకపోవడము, చదువు నేర్చిన వాళ్ళయినా తెలుగు పుస్తకము ముట్టుకోకపోవడము, ఇంగ్లీషు పుస్తకాలే ఎప్పుడూ చదువడము సంభవించినది! ఇకనైనా తెలుగువారు కండ్లు విప్పి చూతురా!

51. ప్రస్తుత మనుసరింతాము. విచక్షణులు కానిలాక్షణికు లేమంటేనేమి నన్నయాది మహాకవులందరూ 'కన్నులు' అనేశబ్దము సభ్యవర్ణనలోనే వాడి ఉన్నారు. నన్నయ గిరికాదేవిని వర్ణిస్తూ "కలికిక్రాల్గన్నుల తెలుపు" (అది. III 29) అనిన్ని, ఉత్తరను వర్ణిస్తూ 'చన్నులుఁ గన్నులు" (విరాట 1. 245) అనిన్ని, తెనాలి రామకృష్ణుడు భగవంతుని"వెడదకన్నులవాని వెయ్యినామముల వాని (పాండు 1. 213) అనిన్ని, జక్కన "కన్నులు గండుమీలు" అనిన్నీ, వాడిఉన్నారు. వందలుకాదు; వేలు ప్రయోగాలు ఉదాహరింపవచ్చును,'కన్నులు' అనవలసినప్పుడల్లా 'కనుదోయి' 'కనుఁగవ' అనవలసిన నియమము లేదు! లేదు! లేదు!

52. (9) బొడ్డు—ఈ శబ్దముకూడా గ్రామ్యమట! స్త్రీలయినా పురుషులయినా ఉత్తముల 'బొడ్డు' 'పొక్కిలి' అనవలెనట! గుడ్డిలక్షణము! గుడ్డి పాండిత్యము! సభా. 1.143 "ఒక్కొక్క చన్నును, జెవియును, జెక్కును, జను బొడ్డు మూఁపు...." లోనిమాటలు మెడికల్ కాలేజీలో వాడవలసిన 'అన్నుల చన్నుల' వంటి వంటారు గాబోలు: పోనీండి. విజ్ఞా. ఆచా. "బొడ్డు క్రింది యంగములు విప్రుఁజోఁకిన నచట గడుగవలయును" దీనిలో నున్న 'బొడ్డు' శానిటరీ డిపార్టుమెంటువారి పరిభాష అంటారా? వరాహ X. 53. 'బొడ్డుబంటిగా' ఇది ఇంజనీరింగు కాలేజీ పరిభాషగాబోలు! నాసికా పుటములు, నయనముల్, శ్రోత్రముల్, బొడ్డును, వక్షంబు భుజములందు (52)— ఈవాక్యములో అరవయవముల పేళ్ళున్నవి: వాటిలో 'బొడ్డు' ఒక్కటే ఏమిపాపము చేసుకొన్నది? దాన్ని మంత్ర శాస్త్రపరిభాషలో చేర్చుకొంటాముగాని, కావ్యాలలో ఉంచనీయ మంటారు గాబోలు! అయితే, ఇదో? కాశీ. V. 224 "అనంతరంబు బొడ్డు నివురుకొంచుం బ్రాణాపాన సమానోదాన వ్యానంబులు తృప్తిబొంది నాకు నానందం బొసంగుం గాతయని యాశీర్వదించు

కొనునది"—ఇది కుక్షింభరణ పరాయణుల పరిభాషే, గాని కావ్యాలలో బ్రాహ్మణ సంతర్పణము వర్ణించరా ? పోనీండి. భాగ II. 240. చ. "ప్రియుఁడగు బొడ్డుఁదమ్మి తొలిబిడ్డడు వేలుపుఁబెద్ద" భాగ IX. 376. సీ. ఒకవేయి తలలతోనుండు జగన్నాథు బొడ్డుదమ్మిని బ్రహ్మపుట్టెమొదట' చిత్రభార. IV. 120....'బొడ్డుఁ దామర పువ్వునఁ బొడమినట్టి ముద్దు పాపఁడు నాలుగు మోములాఁడు'— ఈ వాక్యములలో 'బొడ్డు' పురుషులది, మొగవాళ్ళకు 'బొడ్డు'న్నా ఆడవాళ్ళకుమాత్రము 'బొడ్డు' పెట్టడము గ్రామ్యము. పొక్కిలే ఉండవలెను, కాంతాసమ్మితములయిన సత్కావ్యములలో సత్కవుల సాంప్రదాయము అదే; అని వాదించే పండితుల అజ్ఞాన ధ్వాంతభాస్కర మనే భేషజము ఇదిగో! పింగళసూరన రచించిన ప్రభావతీప్రద్యుమ్నములో (చూ. II. 83) ప్రభావతి సౌందర్యము వర్ణిస్తూ హంస ప్రద్యుమ్నునితో చెప్పిన వాక్యము చూస్తే తెలిసివస్తుంది.

తే. నెన్నడిమి పేరిమింట నన్నెలఁత బొడ్డు,
పొన్నవిరి నిక్కముగఁజూచి చిన్న బోదు
రభ్రకుసుమ సౌరభ సాధనార్థహేతు,
వాశ్రయా సిద్ధమనియెడి యయ్యలెల్ల.

సూరనా సత్కవి! ప్రభావతీ ప్రద్యుమ్నమా సత్కావ్యము! ప్రభావతా ఉత్తమ నాయిక! ప్రద్యుమ్నుడా ఉత్తమ నాయకుడు! వాక్యమా వాణి యను గ్రహమున శబ్ద సంస్కార పూతమయిన ముఖముగల 'శుచి ముఖి' పలికినది!

దుష్టలక్షణమువల్లను గుడ్డిపంతుల అవిమృశ్యకారిత్వము వల్లను ఆంధ్ర భాషకు, ఆంధ్ర సారస్వతమునకు, ఎంతకీడు కలుగుతున్నదో చూచినారా ?

## అది, ఇది: వాఁడు; వీఁడు.

53. పూజ్యురాండ్లయిన ఉత్తమ స్త్రీలనుగురించి మాట్లాడేటప్పుడు 'అది' ఇది, అనే సర్వనామములు ఇప్పటి లౌకిక భాషలో శిష్టులు వాడరు. అయితే, ఇప్పటి లౌకికభాష గ్రామ్యమని వేంకటరాయ శాస్త్రులవారు నిరాకరించినారు, వారికి గ్రంథములలోని భాషమాత్రమే సాధువు, దానికి వ్యతిరిక్తమైనది, శిష్టజన వ్యవహారమందున్నా సాధువుకాదు. ఇట్టి నియమముగల శాస్త్రులవారు నేటి భాషా మర్యాద ప్రమాణముగా చేసుకొని కాబోలు వేంకటరత్నము పంతులవారి ప్రయోగములను నిందించినారు. ఇది మాకు వింతగానున్నది. శ్రీ ధ ప్రసన్నరాఘవములో (చూ. పుట. 26) రాముడు సీతను గూర్చి:—

"క. ఇదె నామదియను కలువకు, ముదంబునిడు శారదమగు పున్నమరేయై
పొదలెడు వెండియునీయెడ, నిదియె జగన్మోహిని యన నెసఁగెడునాహా.

ఈ ప్రయోగమును నిందిస్తూ శాస్త్రిలవా రేమన్నారో చూడండి:— 'ఇది', 'ఇదియె' యని సీతకు రాముఁడు ప్రయోగించుట కడు విరసముగా నున్నది. వృద్ధ పత్యుచితము (చూ. విమర్శము పు 90). ప్రసన్న రాఘవ మందే (చూ. పుట 29) రామలక్ష్మణ సంభాషణములో, "లక్ష్మణుఁడు ఆర్యా! ఇది యగపడుచున్నది. రాముడు—అది యెట్లు తిరిగివచ్చెను?" అనే వాక్యము లున్నవి. శాస్త్రిలవారి విమర్శములో (చూ. పు 107) "ఇందు 'ఇది' యను పదము సీతాపరముగా రాముఁడు గ్రహించినట్లు ఉత్తర వాక్యము వలనం దెలియుచున్నది లక్ష్మణునిచేత సీతను 'ఇది' యనిపించుట రాముని చేత 'అది' అనిపించుట రసాభాసముగా నున్నది. వృద్ధపత్యుచితమని తెలిపి యున్నాఁడ" అని రెండవమారు ఆక్షేపించినారు. మరి ఒకచోటకూడా 'ఇది' అని సీతనుగురించి రాముడన్న వాక్యములో ఉంటే, 'నాగరముగా లేదు' అని మాత్ర మన్నారు (చూ. విమర్శము పు. 251). ఇట్లు ముమ్మారు జంకు లేకుండా 'ఇది' అది' అనే శబ్దములు ఉత్తమ స్త్రీలను గురించి భర్తలయినా వృద్ధపతులయితేనే తప్ప ప్రయోగించి వాడకూడదని శాస్త్రిలవారు నిషేధించి నప్పుడు, తమ అభిప్రాయమందు దృఢవిశ్వాసము గలవారనే ఊహించ వలెనుగదా. మరి, చూడండి ప్రాచీన కవులు ఈ శబ్దములు ఉత్తమ స్త్రీలను గురించి చెప్పిన వాక్యములలో ఎట్లు వాడి ఉన్నారో.

54. మొట్టమొదట ఆదిమకవి నన్నయ రచించిన భారతములోనివే ప్రయోగాలు స్థూలదృష్టితో చూస్తే కనబడ్డవాటిలో మూడుపదులు ఉదాహరిస్తాము.

(1) ఆది. I. 29. సీ. "ఎవ్వరి సతియిది సెప్పుమా జాతవేద." (భృగుపత్ని).

(2) ఆది. 1-130. 'ఇది నాకుఁ దొల్లివరియింపంబడిన భార్య'

(౩) ఆది. III. 38. వ. "అదియును, యిమ్మని శాపంబిచ్చునో యని వెఱచి యిట్లనియె" (సత్యవతి వ్యాసుని తల్లి)

(౪) ఆది 3. 40 వ....'అది గంధవతి యనియు యోజనగంధియ నియుఁ' బరగి

(5) ఆది.4.49చ. ఇదిమునినాథకన్యయని యెంతయు నిస్పృహవృత్తినున్న నా
హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిగించి నన్ మదనబాణ పరంపర కిప్పుడుండు నా
స్పదమయి సంచలించె నళి పాత వికంపిత పంకజా కృతిన్.

ఇట్లు దుష్యంతుడు శకుంతలను వివాహము చేసుకోగోరి దానిని గురించి చెప్పిన వాక్యములో ఆరాజుచేతనే నన్నయ 'ఇది' అనిపించినాడు. దుష్యంతుడు 'వృద్ధపతి' కాడు గదా ! శకుంతల వృద్ధనారి కాదుగదా ! వేశ్య కాదు గదా !

(6) ఆది. 4. 134 వ....ప్రతీపుండు దానిం జూచి....యిట్లేల నాకుఁరు వెక్కితనిన నది యిట్లనియె [గంగాదేవి, ముసలిదికాదు: ఉత్తుంగ పయోధరద్వితయ]

(7) ఆది. 4. 137 వ....అది యును నట్ల చేయుదునని యదృశ్య యయ్యె ('అది' గంగాదేవి)

(8) ఆది. 4,143చ కనిముని కన్యయోదనుజకన్యకయో భుజగేంద్ర
కన్యయో యనిమిషకన్యయో యిది వియచ్చర కన్యకయో....

ఇట్లు 'ఇది' అని గంగాదేవిని గురించి శంతనునిచేత నన్నయ అనిపించినాడు. శంతనుడు 'వృద్ధపతి' కాడు, 'సంప్రాప్తయౌవనుడు.'

(9) ఆది. 4.144 వ. అదియును నమ్మహీపతి రూపయౌవన సౌందర్య విలాసంబులకోటువడి ('అది' గంగాదేవి) .... ....

(10) ఆది. 4,152వ....అదియుం దొలిచేసిన సమయంబు దలంచి ('అది' గంగాదేవి)

(11) ఆది. 4.225వ....దీర్ఘతముండు ప్రద్వేషిణినడిగిన నది యిట్లనియె ('అది' బ్రాహ్మణి)

(12) ఆది. 5.189 సీ.గీ....దివిజ నాయకుఁడతి భీతి నెఱిఁగి వాని తపముఁ జెఱుపఁబనిచె ; జలజనయనఁ దరుణి జల పది యనియెడుదాని; నదియు వచ్చె వానికడకు.

(13) ఆది. 6.217 తే....ఇది చాలనబలచీనికలుఁగఁజనదు (హిడింబి)

(14) ఆది. 7.72 సీ. గీ. సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్యకన్య యగు....ఇట్లు సంవరణుడు తపతిం జూచి పలికిన వాక్యములో 'ఇది' అన్నాడు ఇతడు వృద్ధపతికాడు; 'అభినవ యౌవన విభ్రమోద్భాసితుడు'

(15) ఆది 7.213. క. గురువచన స్థితిమనకేగురకును నిది పత్నిగా దగున్, ఇట్లు ధర్మరాజు తమ్ములతో ద్రౌపదినిగూర్చి చెప్పినప్పుడు 'ఇది'

అన్నాడు. ద్రౌపదీ వివాహమునకు పూర్వము పాండవులు వృద్ధులుకారు గద; ద్రౌపది నిత్యయౌవన' అని శాస్త్రులవారికి తెలుసును: తెలియకపోయినా, పెళ్ళి నాటికి ముసలిది కాదుగదా? ఉత్తమస్త్రీయేకదా? ఇట్టిదానినే, ధర్మరాజుచేతనే, నన్నయభట్టే, 'ఇది' అనిపించినాడు!

(16) ఆది VIII 104 సీ. అబ్జజువీడ్కొని యది దేవసభకుఁ బ్రదక్షిణంబొనరింప. (అది తిలోత్తమ)

(17)ఆది. VIII 108క. ఇది నావల్లభ యిది నాహృదయేశ్వరి యనుచు గోరి యిరువురు మదనోన్మదులయి పరిగ్రహించిరి. ('ఇది' తిలోత్తమ; పరిగ్రహించినవారు సుందోపసుందులు వృద్ధులుకారు.)

(18) ఆది. VIII 154 క....ఆతని కది యిట్లనుచుఁ జెప్పె ('అది' వందయను నప్సరస).

(19) అర. II 75 వ. కావున నిది మదనుజీవితయనియు ననువ్రతయనియు నన్ను విడువక నాయనుగమనంబునకు ననుమతుఁడవు గమ్ము. ('ఇది' దమయంతి).

(20) అర. II 77. వ॥ ఇది నన్నుంగానకతనబంధులయొద్దకుంబోయి దుఃఖంబునం బొరయకుండును ('ఇది' యని దమయంతినిగూర్చి నలుడన్నాడు).

(21) అర. II 141 వ. ఇది పతివిముక్తయై యొప్పకుండియుఁదనపతివ్రతాగుణంబున నొప్పుచున్న యది ('ఇది' యని దమయంతినిగూర్చి సుదేవుఁడను బ్రాహ్మణు డన్నాడు: అతడు ముసలివాడు కావచ్చును; గాని దమయంతికిపతికాడు.

(22) అర. 2. 147. వ. అయ్యా యిది యెవ్వనికూఁతురు? (దమయంతిని గురించి రాజమాత సుదేవునితో అన్నవాక్యము)

(23) అర. 2. 148 మధ్యాక్కర. నలినాక్షియిది విదర్భేషుతనయ పుణ్యశ్లోకుఁడైన నలుదేవి దమయంతిసుమ్ము (అని సుదేవుని ప్రత్యుత్తరము).

(24) అర. 2 154 వ. అదిమునుఁగూతు నభిప్రాయంబు భీమునకెఱింగించిన (ఇక్కడ 'అది' భీమరాజు పట్టమహిషి, దమయంతి తల్లి).

(25) అర. 2. 193 వ. కేశినియును బాహుకుపలుకులు నాకారంబును దమయంతి కెఱింగించిన నది యాతని నలుంగా శంకించి. ('అది' దమయంతి)

